# పరిచయం

ఇది మాంచాల నాటకం. పలనాటి వీరచరిత్రకు సంబంధించిన ఘట్టాలన్నీ ఇందులోకి రావు. అందువల్ల వీరచరిత్ర కథను ముందుగా తెలుసుకోవలసిన అవశ్యకత వుంది. పలనాటి రాజుల మూలపురుషుడు అనుగురాజు. ఇతడు కార్తవీర్యుని వంశానికి చెందినవా డని ప్రతీతి. ఉత్తరదేశాన్నుంచి వచ్చి, చందవోలురాజుయొక్క కూతుర్ని వివాహం చేసుకున్నాడు. చందవోలురాజు తన కూతురికి పలనాడు అరణంగా ఇచ్చాడు. ఈ విధంగా అనుగురాజు పలనాటికి ప్రభువు అయినాడు.

అనుగురాజుకి ముగ్గురు భార్యలు. వారు మైలమాదేవి, వీరవిద్యాదేవి, భూరమాదేవి. మైలమాదేవి పుత్రుడు నలగామరాజు. వీరవిద్యాదేవి పుత్రులు పెదమల్లదేవుడు, పినమల్లదేవుడు, బాలమల్లదేవుడు. భూరమాదేవికి కామరాజు, నరసింహభూపతి, ఝట్టిరాజు, పెరుమాళ్ళరాజు అను నలుగురు పుత్రులు కలరు. మరణసమయంలో అనుగురాజు వీరందరినీ మంత్రి బ్రహ్మనాయనికి అప్పగించాడు. నలగామరాజు గురిజాల రాజధానిగా పలనాటిని పరిపాలించే మొదటిరోజుల్లో వీరంతా కలిసే వుండేవారు. కాని రోజులు గడిచినకొద్దీ నాయకురాలు కారణంగా విడిపోవలసి వచ్చింది. అప్పుడు నలగామరాజు బ్రహ్మనాయని కోర్కెపై మలిదేవ రాజులకు మాచర్లభాగాన్ని ఇచ్చి పంపాడు. దీనికి నాయకురాలు అంగీకరించినట్లు కనపడదు. అయినా నలగామరాజు తన సవతి తమ్ములకు మాచెర్లభాగాన్నిచ్చి బహు ఉదారంగా ప్రవర్తించాడు. అప్పటినుంచీ బ్రహ్మనాయడు మాచెర్లను రాజధానిగా చేసుకొని, బాలురైన మలిదేవుల

ప్రతినిధిగా రాజ్యపాలన జరిపాడు. విడిపోయినా నలగామరాజుమీద ప్రేమ చెదరకుండా ఉండటానికే ప్రయత్నించాడు.

కాని నాయకురాలు పరిస్థితులకు తలవొగ్గి ఊరుకునే స్వభావంకలది కాదు. ఎప్పటికప్పుడు పరిస్థితులను తనకు అనుకూలంగా త్రిప్పుకోటానికి ప్రయత్నించే శక్తిస్వరూపిణి. బ్రహ్మనాయని కోడిపోరకి ఆహ్వానించి, ఓడించి ఏడు సంవత్సరాలు బ్రహ్మనాయణ్ణి మలిదేవులను పరభూముల పాలుచేసింది. ఏడుసంవత్సరాలూ పూర్తి అయింతర్వాత వారి భాగాన్ని వారికి ఇవ్వక యుద్ధంలోకి దింపింది. ఈ యుద్ధమే పలనాటియుద్ధం. ఈ యుద్ధం ఎందుకు చెయ్యబడినా, ఫలితం సర్వనాశనమే అయింది.

ఈ యుద్ధంలో బ్రహ్మనాయని అటుంచి, నలగామరాజు ప్రక్క చెప్పుకోదగ్గ పాత్ర నాయకురాలు. ఈమె యిటు అనుగురాజు వంశానికి గానీ, అటు బ్రహ్మనాయని వంశానికిగానీ చెందినవ్యక్తికాదు. ఈమె పంట రెడ్డకులములో జన్మించినది. పలనాడు తాలూకాలోని జిట్టగామాలపాడు ఈమె జన్మస్థలము. ఇంటిపేరు అరవల్లివారు.

ఈమె స్వశక్తిచేత పైకివచ్చిన స్త్రీ. మొదట అనుగురాజు అనుగ్రహం సంపాదించి, ఆతనిమరణానంతరం నలగామరాజువద్ద మంత్రిణిగా స్థిరపడిపోయింది. బ్రహ్మనాయనితో సమముగా తంత్రము నడపగలిగిన సమర్థురాలు, సమముగా పోరగలిగిన శూరురాలు. ఈమెనుగురించి, 'భగవద్గీత'లో మా నాన్నగారు ఈ విధంగా వ్రాశారు. ఈమె " తేటి చూడరాని మగటిమి రూపొందిన తెలుగుబిడ్డ, ఎత్తునకు పైఎత్తు వేయనేర్చిన జాణ, మనుజుల పుత్తెలతో చదరంగమాడనేర్చిన చతురుపాయ ప్రయోగ విధాన వేత్త."

అయితే ఈమెకు బ్రహ్మనాయని కున్న వేదాంత దృష్టిలేదు. ఈమెకు ఈ భౌతిక ప్రపంచమే నిత్యం. దీనికిమించిన సత్యం ఈమెకు

మరొకటి లేదు. అందుకనే చివ్వరికి బ్రహ్మనాయడు ఆమెచేతికి కత్తి అందించి 'ఈ లోకాన్ని పరిపాలించటానికి నీవే అర్హురాలవు' అన్నాడు.

ఈమె చాలా వ్యక్తిత్వంగలిగిన వ్యక్తి. ఈమె వ్యక్తిత్వంముందు నలగామురి పితృప్రేమా, భాతృప్రేమా, బ్రహ్మనాయని ఆధ్యాత్మికదృష్టి నిలువలేకపోయినై. విభిన్నదృష్టులను ఈమె చదును చేసింది. యుద్ధరంగాన్ని ప్రవేశింప జేసింది. మారణహోమం తప్పనిసరి చేసింది. ఈ పనికి అటు బాలచంద్రుని ఆవేశం మాంచాల పట్టుదలా, సహాయం చేసినై. అవన్నీ నాటకంలో స్పష్టపడతై.

♦ ♦ ♦

నేనీ నాటకం రేడియోప్రసారణకు వ్రాశాను. అదికూడా చాలా సంవత్సరాల క్రిందట. పుస్తకరూపంలో ప్రచురిద్దామని సంకల్పం కలిగిన మీదట ప్రదర్శనకు మొదట అనుకూలంగా మార్చుద్దామని అనుకున్నాను. చివరికి యధాతధంగా ఉంచటమే మంచిదని నిశ్చయించుకున్నాను. ప్రసారం కోసం వ్రాసిన నాటకంలో కొన్నిమార్పులు చేశాను. అవికూడా రేడియో విధానానికి అనుకూలంగా వుండేటట్లే చేశాను. అయినప్పటికీ చిన్న చిన్న మార్పులతో ఈనాటకం ప్రదర్శనయోగ్యమైనదనే నేను విశ్వసిస్తున్నాను. ఇది చదువరులు నిర్ధారించవలసిన విషయం.

♦ ♦ ♦

గత శతాబ్దంనుంచీ ఇప్పటివరకూ ఇతర సాహిత్యరంగాలతో పాటు నాటకరంగంలోకూడా ఇతోధికంగా అభివృద్ధికొరకై కృషి జరుగుతూనే వుంది. తిరుపతి కవులు తమనాటకాలతో మహాభారతం మొత్తం ముత్తాన్ని ప్రదర్శనార్హం చేశారు. ఈ నాటకాలతోపాటు చిలకమర్తి వారి

గయోపాఖ్యానం, పానుగంటివారి పాదుకాపట్టాభిషేకం. బలిజేపల్లి లక్ష్మీకాంతం గారి హరిశ్చంద్ర ప్రశంస నందుకోదగినవే। ప్రజలలో మంచి ప్రచారాన్ని గడించుకొన్నవే. ఇక చిత్రనళీయం, సారంగధర, సావిత్రి మొదలైన నాటకాలనుగురించీ ప్రజలలో వాటికున్న ప్రచారాన్నిగురించీ నేను ప్రత్యేకంగా చెప్పవలసిన అవుసరం లేదు అనుకుంటాను.

ఈ నాటకాలను బట్టీ ప్రజలలో అవి సంపాదించిన ప్రాపకాన్నిబట్టీ ఆంధ్రదేశంలో నాటకాభివృద్ధికి కొంతకృషి జరిగిందని అంగీకరించాలి. అయితే పైన నేను ఉదహరించిన నాటకాల్లో ఎక్కువ నాటకాలు మేధావులను, ప్రజలను ఆకర్షించినంత బలంగా, ఆకర్షించలేక పోయినై అనే సంగతికూడా మనం గమనించవలసిన విషయమే।

దీనికి కారణం యేమిటి?

దీనికికారణం మననాటక రచయితలలో శక్తిసామర్థ్యాలు కొరవడటం అని నేను అనుకోవటంలేదు. నిజంగా మన రచయితలు సృష్టించిన కొన్ని కొన్ని రంగాలుచూస్తే మనం వారి చాకచక్యానికి ముగ్ధులం అవటం కద్దు. హరిశ్చంద్రలోని చంద్రమతిని అమ్మినసీను, 'కాటిసీను' గా ప్రసిద్ధికెక్కిన సీను, చిత్రనళీయంలోని నలుడు దేవతలదూతగా దమయంతిని చూసిన సీను 'గుర్రపుశాలసీనుగా ప్రసిద్ధికెక్కిన సీను', సావిత్రిలోని 'యమపాశం' సీను, 'యమలోకం సీను' సారంగధరలోని 'పావురం సీను'గా ప్రసిద్ధికెక్కినసీను, చివ్వరి సీను కడునైపుణ్యంతో నిర్మింపబడిన సీను లని ఎవ్వరైనా అంగీకరించవలసిందే. కాని వొక షేక్స్పియర్ లాగా, వొక ఇబ్సన్‌లాగా, వొక బెర్నార్డ్‌షా లాగా మనం నాటకరచన చెయ్యలేక పోయాం అనే మాటకూడా పైదానితోపాటు అంగీకరించవలసిన మాటే.

ికికారణం నాటక ప్రదర్శనకు ఉపయోగించుకోవలసిన రంగస్థలం,
నాడు వున్న దుస్థితే అని నాకు అనిపిస్తూ ఉంటుంది.

మన రంగస్థలం కదలదు; మెదలదు. ఒక బోనులాఉంటుంది.
ంగాలకు అనువైనవాతావరణం సృష్టించటానికి అనువుగా వుండదు.
ంగాలను త్వరత్వరగా నడపటానికి వీలుండదు. సంభాషణద్వారా తప్ప
రొకవిధంగా మనస్తత్వాన్ని విశదీకరించే వీల్లులేవు. చివర నేలమీద
ర్చునే ప్రేక్షకునికి వినబడేటట్లు చెయ్యటానికి, వినబడేవరకూ అరవ
ం కంటే మరొకమార్గం లేకపోయింది. దీనివల్ల స్వగతాలవంటి కుత్రిమ
ధనాలు తప్పనిసరి అయినై. రంగవిభజనలోనూ, పాత్రల ప్రవేశ నిష్క్రి
ణలోనూ, కొంత అసహజతకు తావు యేర్పడింది. ఈ ఇబ్బందులకు
నై రచయితలు తమనాటకాలను రచించవలసి వచ్చేటప్పటికి దాని అస
జతా అపరిపక్వతా నాటకాలకు అంటకతప్పలేదు. తమసృష్టిని ఒక ఇనుప
చ్చడానికి సరిపడేటట్టు తయారుచెయ్యవలసి వచ్చేటప్పటికి రచన అంత
రకు కుంటుపడటం అనివార్యం అయింది. పరిస్థితులు ఈవిధంగా
న్నప్పటికీ గురజాడవారి 'కన్యాశుల్కం' వేదంవారి 'ప్రతాపరుద్రీయం'
ంటి వుత్తమనాటకాలు తయారైనై అంటే మనం గర్వపడవలసేవుంది.
ని వొకవిషయం మాత్రం వొప్పుకోక తప్పదు. మన నాటకరచయితలు
క్కువమంది ఈనాటిరంగస్థలం పరిస్థితులకు లోబడి తమరచనలను
య్యగలిగారే గాని వాటిని అధిగమించి చెయ్యలేకపోయారు.

ఇప్పుడు పరిస్థితులు మారుతున్నాయి. రంగస్థలాన్ని నవీనపద్ధతు
కు అనుకూలంగా మార్చాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. రచన
లో వాస్తవికతకు ప్రాధాన్యం వస్తూవుంది. ఈ నూతన దృష్టికి పుష్టివి
కూర్చే రచనలు అప్పటికప్పుడే రంగంలోకి దూకినై. ముద్దుకృష్ణగారి
అశోకం' 'అనార్కలి' వంటి నాటకాలూ, ఆత్రేయ నాటకాలూ, నార్ల

వెంకటేశ్వరరావుగారి క్రొత్తగడ్డ నాటికల సంపుటీ, కొప్పరపు సుబ్బారావుగారి నాటికలూ ఈ నూతనదృష్టిని ప్రోత్సహిస్తున్నాయి. మన రంగస్థలంవల్ల మన మనస్సులకు పడిన సంకెళ్ళు విడివడుతున్నాయి. ఇక భవిష్యత్తు ఉజ్వలంగా వుండకతప్పదు.

—గోపీచంద్

## పాత్రలు :

మలిదేవభూపతి

బ్రహ్మనాయుడు

కొమ్మరాజు

కన్నమదాసు

బాలచంద్రుడు

అనపోతు

ఐతమ్మ

రేఖాంబ

మాంచాల

## యుద్ధరంగంలో :

నరసింగరాజు

నాయకురాలు

ఒక పురుషుడు

ఒక స్త్రీ

# మాంచాల

## నాంది ప్రస్తావన :

[మేడపిలో మలిదేవరాజు భవనంలో ఒక పెద్దవసారా. నిరాడంబరంగా అలంకరించబడి వుంటుంది. ఇద్దరు సేవకులు చేతులు కట్టుకుని నిలబడి వుంటారు. రేచర్ల బ్రహ్మనాయడు మలిదేవరాజు కోసం వేచివుంటాడు. కాసేపు కూర్చునివుండి నెమ్మదిగాలేచి, చేతులు వెనక్కి కట్టుకుని పాలోచితంగా పచారు చేస్తుంటాడు. లోపలినుంచి మలిదేవరాజు ప్రవేశం. బ్రహ్మనాయడు యిది చూడడు.]

మలిదేవరాజు :

బ్రహ్మన్న మంత్రీ !

బ్రహ్మనాయడు :

ప్రభువులరాక గమనించలేదు.

మలిదేవరాజు :

ఎంతసేపైంది వచ్చి ?

బ్రహ్మనాయడు :

ఇప్పుడే. ప్రభువులు పనిలో వుండివుంటారని తెలియజేయలేదు.

మలిదేవరాజు :

గురిజాలకు పంపిన రాయబారం సంగతి ఆలోచిస్తున్నాను. రాయబారం సఫలం అయ్యే అవకాశం వుందంటావా బ్రహ్మన్నమంత్రీ !

బ్రహ్మనాయడు :

చెప్పలేం ప్రభూ! నాయకురాలు, నరసింగభూపతి పడనివ్వరు. అందులో సందేహంలేదు. ఇక నలగామప్రభువు మిగిలారు. వారు పట్టు విడుపులువున్న మనిషి. పైగా, రాయబారం వెళ్ళిన అలరాజు ఆయన అల్లుడు. తన కూతురు పేరమ్మకోసమైనా అల్లుడి మాట వినవచ్చు.

మలిదేవరాజు :

ఏమో. నాకు నమ్మకం లేకుండావుంది బ్రహ్మన్న మంత్రీ. అన్నగారికి మనమీద ఏ కొంచెం సానుభూతి వున్నా కోడిపందాలలో నాయకురాలు మనల్ని మాయోపాయంతో ఓడించినపుడు చూస్తూ వూరుకునేవారా? మనం కట్టుగుడ్డలతో వున్నవాళ్ళంవున్నట్లు అడవులకు పోతున్నప్పుడుకూడా పెదవి కదల్పకపోయె! చివరకి తన అల్లుడు అలరాజు భార్యనువిడిచి మనతోపాటు అడవులు పట్టటానికి నిశ్చయించుకున్నప్పుడుకూడా జాలి తలచకపోయె? ఒక్కగానొక్క కూతురు. ఆమె దుస్థితికూడా ఆయన మనసును కరగించలేకపోయింది...యిక యిప్పుడు మన మాచర్లభాగం మనకిచ్చి సంధి చేసుకోవలసిన అవసరం ఆయన కేముంటుంది?

బ్రహ్మనాయడు :

ప్రభువులు చెప్పింది నిజమే. అయినా మనప్రయత్నం మనం చేయవలసిందేగా ప్రభూ! సరిహద్దులను ముందుగా నిర్ణయించుకుని మనం జీవితాలను నడపలేము. జీవితం వుండి వుండి ఎటువంటి మేధావంతుడు వూహించలేని రూపాన్ని

ధరిస్తుంది. అనుసరించటం ద్వారా నూతనమార్గాలను సృష్టించుకుంటుంది. మనం అప్రమత్తతలో వుండి ఎప్పటి కేది మంచి అనుకుంటే దాన్ని చేసుకుంటూ పోవటమే చేయగలం.

మలిదేవరాజు :

కాని మనస్సుమాత్రం ఆరాటపడుతూనే వుంటుంది. అనుసరించని మార్గాలతో ఆకర్షింప బడుతూనే వుంటుంది. చేస్తున్నపని తప్పని శంకిస్తూనే వుంటుంది.

[ మలిదేవరాజు అభిప్రాయం స్పష్టంగా తెలియక, బ్రహ్మనాయుడు ఆలోచనలో పడతాడు. ఇంతలో బైటనుంచి సేవకుడు ప్రవేశిస్తాడు. ]

సేవకుడు :

దేవరవారి దర్శనార్థం కొమ్మరాజుగారు వేంచేశారు.

మలిదేవరాజు :

ప్రవేశపెట్టు. [ సేవకుడు నిష్క్రమిస్తాడు ]

బ్రహ్మనాయుడు :

తనకుమారుడు అలరాజుమీద ప్రభువులు వుంచిన విశ్వాసానికి సముద్రంలాగ వుప్పొంగిపోతున్నారు కొమ్మరాజుగారు. గురిజాల సంగతులేమైనా తెలిసినవేమో కనుక్కుందామని వచ్చివుంటారు.

[కొమ్మరాజు ప్రవేశం. వృద్ధుడు. నేత్రాలు బలహీనంగా వుంటాయి. ఆనందంతో తళుకుతళుకున మెరుస్తూ వుంటాయి.]

కొమ్మరాజు :

దండం మలిదేవభూపతీ!... దండం బ్రహ్మన్నమంత్రీ!

బ్రహ్మనాయడు :

ఇటు దయచేయండి.

కొమ్మరాజు :

[బ్రహ్మనాయని దగ్గరగా కూర్చుంటూ] అబ్బాయి అలరాజు సంగతులేమైనా తెలిసినవా బ్రహ్మన్నమంత్రీ ?

బ్రహ్మనాయడు :

రాత్రి కొన్ని సంగతులు తెలిసినై. అలరాజు నిన్న వుదయానికే గురిజాలప్రాంతాలకు చేరుకున్నాడట. అల్లుడు వస్తున్నాడని తెలిసి నలగామరాజు రకరకాల వాహనాలను, దాసదాసీ జనాన్ని యిచ్చి ప్రాసాదానికి తీసుకురమ్మని తమ్ముడైన నరసింగరాజును ఎదురుగా పంపాడట...

కొమ్మరాజు :

ఆశ్చర్యంగావుంది బ్రహ్మన్నమంత్రీ! నరసింగరాజు యింత సుముఖంగా వుంటాడని నేనుఅనుకోలేదు. అబ్బాయి పని అనుకున్నదానికంటే తేలికయింది.

మలిదేవ భూపతి :

చెప్పు బ్రహ్మన్న మంత్రీ.

బ్రహ్మనాయడు :

వారు గురిజాల పూరిబైట ఎదుర్కోలు యిచ్చి రాజ ప్రాసాదానికి రమ్మని ఆహ్వానించారట. దానికి మనఅలరాజు

అంగీకరించ లేదట. 'నేనిప్పుడు రాయబారిగా వచ్చాను. అల్లుడిగా రాలేదు. నేను వచ్చినకార్యం పూర్తిఅయ్యేవరకు గురిజాల ప్రవేశించను.' అనిచెప్పి, అక్కడే తనకూ పరివారానికీ డేరావేయించాడట.

కొమ్మరాజు :

భళీ... [ఆనంద బాష్పాలతో కన్నులు చెమ్మగిల్లుతవి]

బ్రహ్మనాయుడు :

ప్రభు విశ్వాసంలో తండ్రిని మించాడు అలరాజు. రాజప్రాసాదంలో అడుగుపెట్టింతర్వాత ఏ మొగమోటాలకు లోనుకావలసి వస్తుందోనని ముందుగానే మేలుకున్నాడు.

కొమ్మరాజు :

తరువాత... తరువాత ?

బ్రహ్మనాయుడు :

నలగామరాజు యిక చేసేదిలేక కూతురు పేరమ్మతో 'నువ్వన్నా వెళ్ళి చెప్పమ్మా... చెప్పి తీసుకురా ... నా అల్లుడు ఊరిబయట డేరాలో వుంటే నాకెంత పరువునష్టం' అన్నాడట. దానికి పేరమ్మ పొంగివచ్చే శోకాన్ని ఆపుకుని 'నువ్వాయన్ను అల్లుడిగా ఎప్పుడు చూశావు నాన్నా. ఆయన కోడిపోరు న్యాయంకాదని చెప్తే నువ్వు విన్నావా ? కోడిపోరులో నాయకురాలు మోసం చేసిందంటే నీవు నమ్మావా ? పోనీ వారు అరణ్యవాసానికి వెళ్ళేటప్పుడైనా నువ్వోక మంచి మాటన్నా అన్నావా నాన్నా. ఎప్పుడూ

లేని చుట్టరికం యిప్పుడెందుకు ? జరగవలసినదేదో జరుగుతుంది' అన్నదట.

కొమ్మరాజు :

[ఆనంద బాష్పాలతో] నా కోడలు వరహాలతల్లి.

మలిదేవ భూపతి :

పేరమ్మ ఎప్పుడూ మన పక్షమే. మనం గురిజాల్లో వుండేరోజుల్లో ఎప్పుడూ 'పిన్నయ్యా, పిన్నయ్యా' అంటూ నా వెనకే తిరుగుతుండేది. నాయకురాలంటే ఏమాత్రం గిట్టేది కాదు.

బ్రహ్మనాయుడు :

మనం కోడిపోరులో ఓడి అడవులపాలు కావలసివచ్చినపుడు 'ధర్మమే జయిస్తుంది' అని కబురుచేసింది తల్లి. జ్ఞాపకం వుందా ప్రభూ ? (మలిదేవరాజు తలవూపుతాడు)

కొమ్మరాజు :

[అశ్రువులు తుడుచుకుంటూ] నా బిడ్డలు పలనాటికే గౌరవం తెచ్చారు. వాళ్ళమాటలు ఎంతవిన్నా యింకా వినాలనే అనిపిస్తూవుంది బ్రహ్మన్నమంత్రీ.

బ్రహ్మనాయుడు :

[గ్రహించి] ఈ విధంగా తన కుమార్తెకూడా తన కోర్కె చెల్లించక పోయేటప్పటికి నలగామరాజు చాలా వ్యధపడి అలరాజుకు ఏలోటూ రాకుండా చూస్తూ వుండవలసిందని నరసింగరాజుని ఆజ్ఞాపించి, బండ్లమీద కావలసిన సంభారాలను తోలించాడట. రాజప్రాసాదంలోవున్న దాస

దాసీజనాన్నంతా పంపించాడట. దీనికి నీ కుమారుడు ఏం బదులు చెప్పాడనుకున్నావు… …‘రాజ్యంలేని మలిదేవుని బంటుని నేను. నాకెందుకు యివన్నీ?’ అని వచ్చిన వాటిని వచ్చినట్లు త్రిప్పి పంపివేశాడుట.

కొమ్మరాజు :

భళీ… …

బ్రహ్మనాయుడు :

వేగులవల్ల రాత్రి యింతవరకు సంగతులు తెలిసినవి. మిగిలిన వార్తలకోసమే నేను, మలిదేవభూపతి ఎదురు చూస్తున్నాం. ఏ క్షణాన తెలిసినా తెలియవచ్చు.

కొమ్మరాజు :

నా కొడుకు విజయం సాధించుకుని వస్తాడు, మలిదేవ భూపతీ!

మలిదేవభూపతి :

మా ధైర్యం అదే.

బ్రహ్మనాయుడు :

పోరు నష్టం. యుద్ధం తప్పటం అందరికీ మంచిదే.

[ కొమ్మరాజు ముసలి చెక్కిళ్ళమీదుగా కన్నీరు జారుతుంటుంది. వున్నట్టుండి బైట కలకలం బైలుదేరుతుంది. గుర్రం ఆగి పెద్దపెట్టున సకిలించిన ధ్వని వినిపిస్తుంది. కంగారుగా సేవకుని ప్రవేశం ]

సేవకుడు :

సంగన్న … జాలరిసంగన్న … దేవరవారిదర్శనార్థం.

బ్రహ్మనాయడు :

ప్రవేశపెట్టు.

[సేవకుడు వెళ్ళుతుండగా కొమ్మరాజు ఆవేశం పట్టలేక నుంచుంటాడు. బ్రహ్మనాయని ముఖం అకస్మాత్తుగా జేవురిస్తుంది. రక్తసిక్తమైన దుస్తులతో, ఆయాసంతో కాలు నిలపలేక తూలుతుంటూ సంగన్న ప్రవేశం]

సంగన్న :

మలిదేవభూపతీ! రక్షించు.

మలిదేవభూపతి :

ఏమది ?

బ్రహ్మనాయడు :

అలరాజు క్షేమమా సంగన్నా?

సంగన్న :

యింకెక్కడి అలరాజు ? (ఏడుస్తాడు)

[ బ్రహ్మనాయడు నిర్విణ్ణుడై కూచుంటాడు ]

కొమ్మరాజు :

ఆఁ !...ఏమన్నావ్ ?... ...

మలిదేవభూపతి :

సంగా !

సంగన్న :

ప్రభూ !

మలిదేవభూపతి :

విశదంగా చెప్పు.

సంగన్న :

(ఏడుపు ఆపుకుంటూ) ఏం చెప్పను ప్రభూ ?... వారి మర్యాదలు చూసి అన్నీ సవ్యంగా జరిగిపోతా యను కున్నాం. అయినా ఎప్పటికప్పుడు మా జాగ్రత్తలో మేము వుంటూనేవున్నాం ప్రభూ. మాకు కావలసినవన్నీ మేమే తెచ్చుకున్నాం... వారు తెచ్చిన వస్తువు లొక్కటికూడా ముట్టుకోలేదు... మరి నిన్నరాత్రి... ఎట్లా కట్టుకున్నారో వంటవాణ్ణి...! ముద్ద ఎత్తి అట్లా నోట్లో పెట్టుకున్నారో లేదో... కొయ్య బిగుసుకుపోయినట్లుపోయారు... కళ్ళుముందే రంగంతా నీలంగా తిరిగిపోయింది ప్రభూ... (ఏడుస్తాడు)

(కొమ్మరాజు నిలువుగ్రుడ్లు వేసి వింటూంటాడు)

మలిదేవభూపతి :

ఎంత దారుణం ! !

బ్రహ్మనాయుడు:

నరసింగరాజు సౌమ్యంగా ఉన్నాడని తెలిసినప్పుడు మనస్సు యిందుకే కాబోలు రెపరెప కొట్టుకుంది. తన అన్న గారి అల్లుడని అయినా ఆలోచించకపోయాడు... ఏమి వైప రీత్యం...!...

కొమ్మరాజు :

[ తేరుకొని ] ఔరా ! ఎంత పిచాసికి ఒడిగట్టాడు నర సింగరాజు ?! పేరమ్మ సంగతైనా ఆలోచించకపోయాడే ! అన్న తరువాత సింహాసనాన్ని కైవశం చేసుకోటానికి యీ మార్గం త్రొక్కావా నరసింగా ? మలి దేవ భూ ప తీ !

బ్రహ్మన్నమంత్రీ! ...... యిదుగో చెప్తున్నాను. యిక మనకీ వారికీ సంధిమాటల్లేవు. నా కుమారుని హత్యచేసిన ఆ నరసింగుని తల నా చేతుల్లో వచ్చిపడేవరకు నేను నిద్రపోను. ఆహారం ముట్టను. వాడు పేరమ్మతల్లి హృదయంలో పెట్టిన చిచ్చును వాడిరక్తముతో చల్లారుస్తాను. (కత్తి ఒరనుండి లాగి) యిదే నా ప్రతిజ్ఞ.

మలిదేవభూపతి :

కొమ్మరాజా! అది మా అందరి బాధ్యతానూ. రాచకార్యంలో అలరాజు తన ప్రాణాలను అర్పించాడు. అతనిఆత్మకు శాంతిని చేకూర్చటం మా బాధ్యత...

బ్రహ్మనాయడు :

నలగామరాజు ఏమన్నాడు సంగా?

సంగన్న :

వారికి నిజం ఎట్లా తెలుస్తుంది? మామగారు, అల్లుడు ఒకటవుతారనే భయంతో అల్లుణ్ణి చంపించాడనే నేరంమోపి ప్రజలను రెచ్చగొట్టాలనే వుద్దేశంతో అనుగురాజు కుటుంబంలో ఆరని చిచ్చు రగుల్కొల్పాలనే సంకల్పంతో...
[ చెప్పటానికి సంశయిస్తాడు ]

బ్రహ్మనాయడు :

చెప్పు సంగన్నా...... అలరాజు హత్యకంటే చెడు వార్తలు ఏం చెప్పగలవు?

సంగన్న :

ప్రభువులు క్షమించాలి. (తలవంచుకుని) మలిదేవ భూపతులకుకూడా తెలియకుండా బ్రహ్మన్నమంత్రే యీపని చేయించాడని [మలిదేవరాజు, కొమ్మరాజు నివ్వెరపోతారు] నలగామరాజుకి తెలియజేశారు. నమ్మించారు. వారు వుగ్రులై 'అటు బ్రహ్మనాయడో, యిటు నేనో... అంతే యిద్దరికీ యీప్రపంచంలో చోటులేదు.' అని కఠోరంగా శపథం చేశారు.

బ్రహ్మనాయడు :

ఆహా ! !... ... నాయకురా లెంత భయంకర బుద్ధితో పరిస్థితులను తనకు సానుకూల పరచుకుంది?!!

సంగన్న :

ప్రభూ ! గురిజాల ప్రజలందరూ మనపక్షమే ప్రభూ! కాని కొలువులో ఒక్క రత్నాలపేరమ్మగారు తప్ప నిజం తెలిసినవారు గానీ, చెపితే వినేవారుగాని లేరుప్రభూ. ఆమె ఏం చెయ్యగలుగుతుంది ? ... ... ... [ఏడుస్తాడు]

మలిదేవభూపతి :

సంగా !!

బ్రహ్మనాయడు :

చెప్పు సంగా !

సంగన్న :

ఆమె తండ్రిని నాయకురాలు, నరసింగరాజు ఎదుటే అడగవలసిన నాలుగుమాటలు అడిగింది. 'అల్లుడికన్నా,

కూతురికన్నా, చివరికి పలనాటి మాతకన్నా, నాయకురాలే నీకు ఎక్కువా ?' అని అన్నదట. 'యిక పలనాటికి నాశనం తప్పదు. అనుగురాజు వంశానికి నాశనం తప్పదు' అన్నదట ... ప్రభూ ! ఆమెకూడా ... ఈపాటికి భర్తను చేరే వుంటుంది ప్రభూ !

మలిదేవరాజు :

ఇక మాకు గురిజాలలో మిగిలిన కాస్తా పోయింది.

కొమ్మరాజు :

నా కోడల్నికూడా హత్యచేశారా ? సంగా !

సంగన్న :

లేదు బాబూ ! తన భర్తను విడిచిపెట్టి వుండలేక ఆమే చితిని పేర్పించమని ఆజ్ఞాపించిందట ...

బ్రహ్మనాయుడు :

ఆఁ ... ! !

సంగన్న :

నేను బైలుదేరేటప్పటికి చితినిపేర్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి ప్రభూ ! తండ్రి బతిమాలబోతే ఆయన మొగం చూట్టానికే నిరాకరించిందట పేరమ్మ ప్రభూ !... యీపాటికి అంతా అయిపోయే ఉంటుంది ప్రభూ !...

మలిదేవరాజు :

ఆహా ! పేరమ్మను చూసే భాగ్యం కూడా మాకు లేకుండా పోయింది. గురిజాలనుంచి ధర్మమే తొలిగిపోయినట్లుంది.

బ్రహ్మనాయడు :

ఈ యజ్ఞం పేరమ్మ ఆత్మార్పణతో ప్రారంభం
ావాలని రాసిపెట్టావా చెన్నకేశవా ?...

మలిదేవరాజు :

బ్రహ్మన్న మంత్రీ! ఇంకెందుకు సందేహం?

కొమ్మరాజు :

ఇక యీ కత్తి ఒరలో పెట్టేది ప్రతీకారానంతరమే.
బైట కలకలం, పటాటోపంతో కన్నమదాసు, అతని అను
చరులూ, ప్రవేశం. అందరి దృష్టులూ ఒకసారిగా అతని
మీదకు ప్రసరిస్తాయి. అతడు అందరినీ కలయచూస్తాడు.
రక్తమయమైన సంగన్న దుస్తులు చూస్తాడు.)

కన్నమదాసు :

నిజమా బ్రహ్మన్న మంత్రీ?... (బ్రహ్మనాయడు
మాట్లాడడు. మలిదేవ భూపతి తటపటాయిస్తాడు.)

కొమ్మరాజు :

నిజమే కన్నమదాసూ. అలరాజును హత్యచేశారు.
పేరమ్మ భర్తతోపాటు చితి యెక్కింది...

కన్నమదాసు :

నీచులు! ద్రోహులు!! నరరూప రాక్షసులు...
మలిదేవభూపతీ!... బ్రహ్మన్నతండ్రీ!–రణభేరి వేయించండి.
ిక ఒక్క గడియకూడా ఆగరాదు... బ్రహ్మన్నతండ్రీ!...
ంలతత్వాలు రూపుమాపావు... సంఘంలో హెచ్చుతగ్గులు

పనికిరావు అన్నావు. ... చాపకూడు ప్రవేశపెట్టావు... తక్కువ కులాలకు చెందిన మమ్మల్ని మనుషుల్తో పాటు చేశావు... నీ కొడుకుతో పాటు పెంచావు... నీ కోసం... నీవు తలపెట్టిన అన్ని కార్యాలనూ ప్రోత్సహిస్తూ వచ్చిన యీ మలిదేవ భూపతికోసం... మా ప్రాణాలను అర్పించే అవకాశం ఎప్పుడు వస్తుందా అని మేము కాచుకూర్చున్నాం. ఆ అవకాశం ఇదే... మేమంతా మీ వాళ్ళం... మా ప్రాణాలు మీవి... రణభేరి వేయించండి.

[జై మలిదేవ భూపతికీ....జై....జై బ్రహ్మన్న మంత్రికీ ...జై.... చాపకూడు సిద్ధాంతానికీ....జై.. .అని కన్నమదాసూ అతని అనుచరులూ జయజయ ధ్వానాలు చేస్తారు. జయజయ ధ్వానాలు చేస్తుండగా గండు కన్నమనీడు ప్రవేశం....అతన్నిచూసి అంతా నిశ్శబ్దపూరితు లవుతారు....వృద్ధుడు కన్నమనీడు....సరిగా నడవలేడు. తడబడుతూ అడుగుల వేసుకొంటూ బ్రహ్మనాయడివైపుకు నడుస్తాడు. బ్రహ్మనాయడు అతణ్ణిచూచి లేచి వస్తాడు.... ....]

బ్రహ్మనాయడు :

ఏం బావా ? ఎందుకు యిటు వచ్చావు ?

కన్నమనీడు :

[బ్రహ్మనాయణ్ణి తడవుతూ] బ్రహ్మనాయడా! యుద్ధం నిశ్చయ మైందిటగా.

బ్రహ్మనాయడు :

నీ కెవరు చెప్పారు బావా ?

కన్నమనీడు :

అమ్మాయి మాంచాల చెప్పింది. దానికి ఎక్కడి సంగతులు ముందే తెలుస్తాయి. అది చెప్పేటప్పటికి ఎక్కడ అందుకోకపోతానో అని వచ్చాను.

బ్రహ్మనాయడు :

యుద్ధానికి యీ వున్న వీరులు చాలరా బావా?.... యీ వయసులో నువ్వు రావలసి వచ్చిందా ?

కన్నమనీడు :

యుద్ధానికీ వయస్సుకూ ఏం సంబంధమయ్యా ! నా ఖడ్గం వసారాలో వూరికే వేలాడుతూ వుండటం చూసి నప్పుడల్లా నాకళ్ళల్లో నీరు తిరుగుతుంటుంది....ఇంతకీ.... యుద్ధం యింకా నిశ్చయం కాలేదా ఏమిటి ?

[ఒక్కక్షణం ఎవ్వరూ మాట్లాడరు. కన్నమదాసు బ్రహ్మనాయణ్ణీ, బ్రహ్మనాయడు మలిదేవభూపతినీ చూస్తారు ]

కొమ్మరాజు :

ప్రభువుల ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నాం.

మలిదేవభూపతి :

బ్రహ్మన్నమంత్రీ ! సేనలను ఆయత్తపరచు. సేనాధిపతులను నిర్ణయించు. యుద్ధం ప్రకటించు.

కన్నమనీడు :

మలిదేవ భూపతికి...జై ....బ్రహ్మన్న మంత్రికీ... జై ... చాపకూడు సిద్ధాంతానికీ...జై ......

[వీరుల జయజయ ధ్వానాలతో ఆకాశం పిక్కటిల్లుతుంది.]

—[ తెర ]—

·

# ఒకటో అంకం

## మొదటి రంగం:

[మేడపిలో బ్రహ్మనాయని గృహం. బ్రహ్మనాయడు, ఆతని భార్య ఐతమ్మ మాట్లాడుకుంటూ వుంటారు. తప్పెటలు, డోళ్ళు, సన్నాయిజోళ్ళు, రుంజులు, బాకాలు, భేరీలు, శంఖనాదాలు బైట నుంచి దూరంగా వినిపిస్తూ యుద్ధయత్నాలను సూచిస్తూవుంటాయి.]

ఐతమ్మ :

మీతో కలిసి ఎన్నోకష్టాలు అనుభవించాను. శౌర్యానికి పుట్టినిల్లయిన గండువారి యింట్లో పుట్టి అనేక యుద్ధాలు కండ్లారా చూచాను. మాచర్ల భాగాన్ని విడిచి, అరణ్యాల పాలు కావలసి వచ్చినపుడుకూడా నాకు మనస్సు కలవర పడలేదు. కాని ఎందుకో యీ యుద్ధంపేరు చెప్పితేనే భయం కలుగుతూవుంది.

బ్రహ్మనాయడు :

భయమెందుకు ఐతా? భగవంతుడు లీలావినోది. భగవంతుని లీల కాకపోతే ఒక్క నాయకురాలు మనకిన్ని అపజయాలు కలిగించ కలిగేదేనా? మన దేముంది? మనం నిమిత్తమాత్రులం. మనతో భగవంతుడు తన ఆదర్శాలను చిత్ర విచిత్రంగా నెరవేర్చుకుంటూ వుంటాడు. ఆయన ఆజ్ఞలను శిరసావహించటమే మనవిధి. [బైట భేరీనాదం] చూశావా, వాళ్ళవుత్సాహం! పామర జనం అనుకుంటాం కాని, ఏ ఆలోచనా లేకుండా నిర్నిమిత్తంగా పరవశత్వంతో ప్రాణాలను భగవదర్పితం చేసేవాళ్ళే ధన్యులు.

సంగన్న :

(వీపు తడుముకుంటూ) ఏం చెప్పను ప్రభూ?... వారి మర్యాదలు చూసి అన్నీ సవ్యంగా జరిగిపోతా యను కున్నాం. అయినా ఎప్పటికప్పుడు మా జాగ్రత్తలో మేము వుంటూనేవున్నాం ప్రభూ. మాకు కావలసినవన్నీ మేమే తెచ్చుకున్నాం... వారు తెచ్చిన వస్తువు లొక్కటికూడా ముట్టుకోలేదు... మరి నిన్నరాత్రి... ఎట్లా కట్టుకున్నారో వంటవాణ్ణి...! ముద్ద ఎత్తి అట్లా నోట్లో పెట్టుకున్నారో లేదో... కొయ్యబిగుసుకుపోయినట్లుపోయాడు... కళ్ళుముందే రంగంతా నీలంగా తిరిగిపోయింది ప్రభూ... (ఏడుస్తాడు)

(కొమ్మరాజు నిలువుగ్రుడ్లు వేసి వింటూంటాడు)

మలిదేవభూపతి :

ఎంత దారుణం!!

బ్రహ్మనాయుడు:

నరసింగరాజు సౌమ్యంగా ఉన్నాడని తెలిసినప్పుడు మనస్సు యిందుకేకాబోలు రెపరెప కొట్టుకుంది. తన అన్న గారి అల్లుడని అయినా ఆలోచించకపోయాడు... ఏమి వైప రీత్యం...!...

కొమ్మరాజు :

[ తేరుకొని ] ఔరా! ఎంత నీచానికి ఒడిగట్టాడు నర సింగరాజు?! పేరమ్మ సంగతైనా ఆలోచించకపోయాడే! అన్న తరువాత సింహాసనాన్ని కైవశం చేసుకోటానికి యీ మార్గం త్రొక్కావా నరసింగా? మలిదేవభూపతీ!

బ్రహ్మన్నమంత్రీ ! ...... యిదుగో చెప్తున్నాను. యిక మనకీ వారికీ సంధిమాటల్లేవు. నా కుమారుని హత్యచేసిన ఆ నరసింగుని తల నా చేతుల్లో వచ్చిపడేవరకు నేను నిద్రపోను. ఆహారం ముట్టను. వాడు పేరమ్మతల్లి హృదయంలో పెట్టిన చిచ్చును వాడిరక్తముతో చల్లారుస్తాను. (కత్తి ఒరనుండి లాగి) యిదే నా ప్రతిజ్ఞ.

మలిదేవభూపతి :

కొమ్మరాజా ! అది మా అందరి బాధ్యతానూ. రాచకార్యంలో అలరాజు తన ప్రాణాలను అర్పించాడు. అతనిఆత్మకు శాంతిని చేకూర్చటం మా బాధ్యత...

బ్రహ్మనాయడు :

నలగామరాజు ఏమన్నాడు సంగా ?

సంగన్న :

వారికి నిజం ఎట్లా తెలుస్తుంది ? మామగారు, అల్లుడు ఒకటవుతారనే భయంతో అల్లుణ్ణి చంపించాడనే నేరంమోపి ప్రజలను రెచ్చగొట్టాలనే వుద్దేశంతో అనుగురాజు కుటుంబంలో ఆరని చిచ్చు రగుల్కొల్పాలనే సంకల్పంతో...

[ చెప్పటానికి సంశయిస్తాడు ]

బ్రహ్మనాయడు :

చెప్పు సంగన్నా...... అలరాజు హత్యకంటే చెడు వార్తలు ఏం చెప్పగలవు ?

సంగన్న :

ప్రభువులు క్షమించాలి. (తలవంచుకుని) మలిదేవ భూపతులకుకూడా తెలియకుండా బ్రహ్మన్నమంత్రే యీపని చేయించాడని [మలిదేవరాజు, కొమ్మరాజు నివ్వెరపోతారు] నలగామరాజుకి తెలియజేశారు. నమ్మించారు. వారు వుగ్రులై 'అటు బ్రహ్మనాయుడో, యిటు నేనో... అంతే యిద్దరికీ యీప్రపంచంలో చోటులేదు.' అని కఠోరంగా శపథం చేశారు.

బ్రహ్మనాయుడు :

ఆహా!!...... నాయకురా లెంత భయంకర బుద్ధితో పరిస్థితులను తనకు సానుకూల పరచుకుంది?!!

సంగన్న :

ప్రభూ! గురిజాల ప్రజలందరూ మనపక్షమే ప్రభూ! కాని కొలువులో ఒక్క రత్నాలపేరమ్మగారు తప్ప నిజం తెలిసినవారు గానీ, చెపితే వినేవారుగాని లేరు ప్రభూ. ఆమె ఏం చెయ్యగలుగుతుంది?......... [ఏడుస్తాడు]

మలిదేవభూపతి :

సంగా!!

బ్రహ్మనాయుడు :

చెప్పు సంగా!

సంగన్న :

ఆమె తండ్రిని నాయకురాలు, నరసింగరాజు ఎదుటే అడగవలసిన నాలుగుమాటలు అడిగింది. 'అల్లుడికన్నా,

కూతురికన్నా, చివరికి పలనాటి మాతకన్నా, నాయకురాలే నీకు ఎక్కువా?' అని అన్నదట. 'యిక పలనాటికి నాశనం తప్పదు. అనుగురాజు వంశానికి నాశనం తప్పదు' అన్నదట... ప్రభూ! ఆమెకూడా... ఈపాటికి భర్తను చేరే వుంటుంది ప్రభూ!

మలిదేవరాజు :

ఇక మాకు గురిజాలలో మిగిలిన కాస్తా పోయింది.

కొమ్మరాజు :

నా కోడల్నికూడా హత్యచేశారా? సంగా!

సంగన్న :

లేదు బాబూ! తన భర్తను విడిచిపెట్టి వుండలేక ఆమే చితిని పేర్పించమని ఆజ్ఞాపించిందట...

బ్రహ్మనాయుడు :

ఆఁ...!!

సంగన్న :

నేను బైలుదేరేటప్పటికి చితినిపేర్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి ప్రభూ! తండ్రి బతిమాలబోతే ఆయన మొగం చూట్టానికే నిరాకరించిందట పేరమ్మ ప్రభూ!... యీపాటికి అంతా అయిపోయే ఉంటుంది ప్రభూ!...

మలిదేవరాజు :

ఆహా! పేరమ్మను చూసే భాగ్యం కూడా మాకు లేకుండా పోయింది. గురిజాలనుంచి ధర్మమే తొలిగిపోయి నట్లుంది.

బ్రహ్మనాయడు :

ఈ యజ్ఞం పేరమ్మ ఆత్మార్పణతో ప్రారంభం కావాలని రాసిపెట్టావా చెన్నకేశవా ?...

మలిదేవరాజు :

బ్రహ్మన్న మంత్రీ ! ఇంకెందుకు సందేహం ?

కొమ్మరాజు :

ఇక యీ కత్తి ఒరలో పెట్టేది ప్రతీకారానంతరమే. (బైట కలకలం, పటాటోపంతో కన్నమదాసు, అతని అనుచరులూ, ప్రవేశం. అందరి దృష్టులూ ఒకసారిగా అతని మీదకు ప్రసరిస్తాయి. అతడు అందరినీ కలయచూస్తాడు. రక్తమయమైన సంగన్న దుస్తులు చూస్తాడు.)

కన్నమరాజు :

నిజమా బ్రహ్మన్న మంత్రీ ?... (బ్రహ్మనాయడు మాట్లాడడు. మలిదేవ భూపతి తటపటాయిస్తాడు.)

కొమ్మరాజు :

నిజమే కన్నమదాసూ. అలరాజును హత్యచేశారు. పేరమ్మ భర్తతోపాటు చితి యెక్కింది ...

కన్నమదాసు :

నీచులు ! ద్రోహులు !! నరరూప రాక్షసులు ... మలిదేవభూపతీ! ... బ్రహ్మన్నతండ్రీ !–రణభేరి వేయించండి. ఇక ఒక్క గడియకూడా ఆగరాదు ... బ్రహ్మన్నతండ్రీ ! ... కులతత్వాలు రూపుమాపావు ... సంఘంలో హెచ్చుతగ్గులు

పనికిరావు అన్నావు. ... చాపకూడు ప్రవేశపెట్టావు... తక్కువ కులాలకు చెందిన మమ్మల్ని మనుషుల్తో పాటు చేశావు... నీ కొడుకుతో పాటు పెంచావు... నీ కోసం... నీవు తలపెట్టిన అన్ని కార్యాలనూ ప్రోత్సహిస్తూ వచ్చిన యీ మలిదేవ భూపతికోసం... మా ప్రాణాలను అర్పించే అవకాశం ఎప్పుడు వస్తుందా అని మేము కాచుకున్నాం. ఆ అవకాశం ఇదే... మేమంతా మీ వాళ్ళం... మా ప్రాణాలు మీవి... రణభేరి వేయించండి.

[జై మలిదేవ భూపతికీ....జై....జై బ్రహ్మన్న మంత్రికీ ...జై.... చాపకూడు సిద్ధాంతానికీ....జై.. .అని కన్నమదాసూ అతని అనుచరులూ జయజయ ధ్వానాలు చేస్తారు. జయజయ ధ్వానాలు చేస్తుండగా గండు కన్నమనీడు ప్రవేశం....అతన్నిచూసి అంతా నిశ్శబ్దపూరితు లవుతారు....వృద్ధుడు కన్నమనీడు....సరిగా నడవలేడు. తడబడుతూ అడుగులు వేసుకొంటూ బ్రహ్మనాయడివైపుకు నడుస్తాడు. బ్రహ్మనాయడు అతణ్ణిచూచి లేచి వస్తాడు........]

బ్రహ్మనాయడు :

ఏం బావా ? ఎందుకు యిటు వచ్చావు ?

కన్నమనీడు :

[బ్రహ్మనాయణ్ణి తడవుతూ] బ్రహ్మనాయడా ! యుద్ధం నిశ్చయ మైందిటగా.

బ్రహ్మనాయడు :

నీకెవరు చెప్పారు బావా ?

కన్నమనీడు :

అమ్మాయి మాంచాల చెప్పింది. దానికి ఎక్కడి సంగతులు ముందే తెలుస్తాయి. అది చెప్పేటప్పటికి ఎక్కడ అందుకోకపోతానో అని వచ్చాను.

బ్రహ్మనాయడు :

యుద్ధానికి యీ వున్న వీరులు చాలరా బావా?.... యీ వయసులో నువ్వు రావలసి వచ్చిందా?

కన్నమనీడు :

యుద్ధానికీ వయస్సుకూ ఏం సంబంధమయ్యా! నా ఖడ్గం వసారాలో వూరికే వ్రేలాడుతూ వుండటం చూసి నప్పుడల్లా నాకళ్ళల్లో నీరు తిరుగుతుంటుంది....ఇంతకీ.... యుద్ధం యింకా నిశ్చయం కాలేదా ఏమిటి?

[ఒక్కక్షణం ఎవ్వరూ మాట్లాడరు. కన్నమదాసు బ్రహ్మనాయణ్ణీ, బ్రహ్మనాయడు మలిదేవభూపతినీ చూస్తారు.]

కొమ్మరాజు :

ప్రభువుల ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నాం.

మలిదేవభూపతి :

బ్రహ్మన్నమంత్రీ! సేనలను ఆయత్తపరచు. సేనాధిపతులను నిర్ణయించు. యుద్ధం ప్రకటించు.

కన్నమనీడు :

మలిదేవ భూపతికి... జై.... బ్రహ్మన్న మంత్రికీ... జై... చాపకూడు సిద్ధాంతానికీ... జై......

[వీరుల జయజయ ధ్వానాలతో ఆకాశం పిక్కటిల్లుతుంది.]

—[ తెర ]—

# ఒకటో అంకం

## మొదటి రంగం:

[మేడపిలో బ్రహ్మానాయని గృహం. బ్రహ్మనాయడు, ఆతని భార్య ఐతమ్మ మాట్లాడుకుంటూ వుంటారు. తప్పెటలు, డోళ్ళు, సన్నాయిజోళ్ళు, రుంజలు, బాకాలు, భేరీలు, శంఖనాదాలు బైట నుంచి దూరంగా వినిపిస్తూ యుద్ధయత్నాలను సూచిస్తూవుంటాయి.]

ఐతమ్మ :

మీతో కలిసి ఎన్నో కష్టాలు అనుభవించాను. శౌర్యానికి పుట్టినిల్లయిన గండువారి యింట్లో పుట్టి అనేక యుద్ధాలు కండ్లారా చూచాను. మాచర్ల భాగాన్ని విడిచి, అరణ్యాల పాలు కావలసి వచ్చినప్పుడుకూడా నాకు మనస్సు కలవరపడలేదు. కాని ఎందుకో యీ యుద్ధంపేరు చెప్పితేనే భయం కలుగుతూవుంది.

బ్రహ్మనాయడు :

భయమెందుకు ఐతా? భగవంతుడు లీలావినోది. భగవంతుని లీల కాకపోతే ఒక్క నాయకురాలు మనకిన్ని అపజయాలు కలిగించ కలిగేదేనా? మన దేముంది? మనం నిమిత్తమాత్రులం. మనతో భగవంతుడు తన ఆదర్శాలను చిత్ర విచిత్రంగా నెరవేర్చుకుంటూ వుంటాడు. ఆయన ఆజ్ఞలను శిరసావహించటమే మనవిధి. [బైట భేరీనాదం] చూశావా, వాళ్ళవుత్సాహం! పామర జనం అనుకుంటాం కాని, ఏ ఆలోచనా లేకుండా నిర్నిమిత్తంగా పరవశత్వంతో ప్రాణాలను భగవదర్పితం చేసేవాళ్ళే ధన్యులు.

ఐతమ్మ :

బాలుడు యింట్లో లేడు.

బ్రహ్మనాయడు :

అదీ ఒకందుకు మంచిదే. అపరిణత బుద్ధులను రాజకీయాలకు దూరంగా వుంచటమే మంచిది. మన బాలచంద్రుడే యిక్కడవుంటే పరిస్థితు లేనాడో విషమించేవి.

ఐతమ్మ :

అయితే మీరు యుద్ధానికి వెళ్తున్నారని బాలునికి తెలియదా?

బ్రహ్మనాయడు :

తెలియదు.

ఐతమ్మ :

తెలిస్తే ఆపలేము. నాయకురాలి పేరెత్తితేనే వాడికి శివమెత్తుతుంది.

బ్రహ్మనాయడు :

అందుకనే తెలియకుండా వుంచాను. బాలునికి, వుద్రేకోత్సాహాలకు తగిన కార్యనైపుణ్యం లేదు... అహాం.. నీ కొడుకు శక్తి సామర్థ్యాలను శంకిస్తున్నా ననుకునేవు. అతని వయస్సు అటువంటిది.

ఐతమ్మ :

వారంరోజు లైంది, యింటిచాయలకైనా రాలేదు.

బ్రహ్మనాయడు :

సాని సబ్బాయి యింట్లో నేనా?

ఐతమ్మ :

(నిట్టూరుస్తూ) అవును.

బ్రహ్మనాయడు :

తండ్రిని నాదేముంది గాని, తల్లివి కష్టమంతా నీదే. పాపం మేనకోడల్నిచ్చి చేసుకున్నావు. వాళ్లు సుఖంగా కాపురంచేస్తూవుంటే చూసి సంతోషిద్దా మనుకున్నావు. హుఁ...ఏం లాభం?...కోర్కెలైతే కోరగలంగాని, భగవంతుని నిర్ణయం ఎలావుంటుందో మనకేం తెలుస్తుంది? భగవంతుడు చిద్విలాసుడు!

ఐతమ్మ :

మొన్న మాడవి మా కన్నవారింటికి వెళ్ళిందిట. అక్కడ కోడలు మాంచాల కనిపించిందిట.

బ్రహ్మనాయడు:

ఏమన్నది?

ఐతమ్మ :

మీ రిప్పుడన్నమాటే అన్నది.

బ్రహ్మనాయడు :

నీ కోడలు వుత్తమురాలు. చూడు ఐతా, ఈ లోకంలో వుత్తములకే అన్ని కష్టాలూనూ. కష్టాలు లేనిదే మంచితనం బైటపడదుకాబోలు.

ఐతమ్మ :

ఇంతకీ మాంచాల కష్టాలు ఎప్పటికేనా గట్టెక్కేనా?

బ్రహ్మనాయుడు :

ఎవరు చెప్పగలరు? నీ కొడుకు పుద్రేకి. మనస్సు తిరిగితే ఒక్క మాంచాలనే కాదు విశ్వాన్నంతా తన కౌగిలిలోకి తీసుకుని ప్రేమించగల శక్తివంతుడు. అదే నా భయం.

ఐతమ్మ :

భయమా?

బ్రహ్మనాయుడు :

కాదు మరి! ఎంత శక్తితో ప్రేమించగలడో అంత శక్తితో ద్వేషించగలడుకూడాను. అందువల్లనే అతను పల నాడు నాశనానికికూడా కారకుడవుతాడేమోనని నా భయం!

ఐతమ్మ :

యుద్ధం ఎట్లాగూ నాశనహేతువే......

బ్రహ్మనాయుడు :

కాని ఎప్పటికప్పుడు సంధిజరిగే అవకాశం వుండనే వుంటుంది. బాలుడికి తెలిస్తే పడనివ్వడు.

ఐతమ్మ :

ఈ పరిస్థితుల్లో సైతం సంధికి ప్రయత్నిస్తున్నారా?

బ్రహ్మనాయుడు :

అవును. ఐతా! నీకు తెలియని దేముంది? నేను మొదటి నుంచి సంధికే ప్రయత్నిస్తున్నాను. నలగామరాజు తన

అల్లుడి మాట తోసివెయ్యడనే ధైర్యంతో అలరాజును అతని దగ్గరకు రాయబారం పంపాను. నేటి కదీ చెడుగానే పరిణమించింది. విన్నావుగా ఐతా! నాయకురాలు అతన్ని హత్య చేయించింది. తన ప్రభువుకి అల్లుడనికూడా ఆలోచించిందికాదు. ఈ ఘోరవార్త తెలిసినతర్వాత 'మన సైన్యాలను అదుపులో పెట్టటం సాధ్యంకాలేదు. యుద్ధానికి దిగటం తప్పనిసరి అయింది.

ఐతమ్మ :

యిక యిప్పుడు జరగవలసిందేమిటి ?

బ్రహ్మనాయడు :

మనం బలహీనులమనే వుద్దేశంతో 'కదనం; కదనం' అని బెదిరిస్తూవుంది నాయకురాలు. మనం సైన్యాలను సమకూర్చుకుని కారంపూడిలో దిగితిమా, మన బలం కళ్ళారా చూసినతర్వాతనైనా సంధికి అంగీకరిస్తుందని నా నమ్మకం.

ఐతమ్మ :

అయితే బాలు డిక్కడ వుంటేనే మంచిది.

బ్రహ్మనాయడు :

ఆ సంగతే నీకు చెప్పదలచాను. యుద్ధానికి ముహూర్తం నిశ్చయం చేయించాను. [ బైటనుంచి భేరీ నినాదాలు సమీపిస్తాయి ] ఏకాదశినాడు కదలి వెళ్ళ

తున్నాం. మేము వెళ్ళినతర్వాత యిక్కడ ఏ అలజడీ జరుగ కుండా, బాలమలిదేవుని పట్టంగట్టి, మన బాలుణ్ణి మంత్రిగా చేసి, అనపోతుని కరణంగా నియమించాను.

ఐతమ్మ :

కుర్రవాళ్ళను దిగబెట్టి వెళ్తున్నారు గనుక సంధి కింక మానవ సంబంధమైన అడ్డంకు లేమీా వుండవు.

బ్రహ్మనాయడు :

బాలుణ్ణి కనిపెట్టి వుండు.

ఐతమ్మ:

వాడిది సూక్ష్మబుద్ధి. ఒకవేళ గ్రహిస్తే ?...

బ్రహ్మనాయడు :

మాంచాల వుద్దేశ మేమిటో ?...

ఐతమ్మ:

నా మేనకోడలు నిండుకుండ. మూర్తీభవించిన పల నాడే ఆమె.

బ్రహ్మనాయడు :

బాలుడు యావనోద్రేకంలో వున్నాడు. నీ మేన కోడలు సౌంధర్యరాసి. ఆమె సౌందర్యాన్ని బాలుడు ఒక్క

సారి చూస్తే.........పలనాటిని రక్షించిన కీర్తి ఆమెకు లభిస్తుంది.

ఐతమ్మ:

ప్రయత్నిస్తాను [బయట జయభేరి మోత]

బ్రహ్మనాయుడు :

అదుగో. జయభేరి. పలనాడు భవిష్యత్తు మాంచాల చేతుల్లో వుంది. [బయటనుంచి పాటరూపంలో బ్రహ్మ నాయని స్తుతి వినిపిస్తుంది.]

బాసదబ్బరగండ బ్రహ్మన్నా, నీకు జయమూ, దిగ్విజయమూ!
ఆదినారాయణుని అపరావతారా ! జయమూ
చాపకూడున సర్వసామ్య ముందన్నావు....జయమూ
అన్నివర్ణము లేకమైన ముక్తన్నావు .... జయమూ
అరివీర కరి ప్రాణహరణ పంచాననా జయమూ....
ఆశ్రితావళినోము అమరభూమీరుహా జయమూ....
బాసదబ్బరగండ బ్రహ్మన్నా, నీకు జయమూ, దిగ్విజయమూ.

బ్రహ్మనాయుడు :

నేనంటే ప్రజలకెంత నమ్మకం ? !

ఐతమ్మ:

వారు మీ భక్తులు.

బ్రహ్మనాయుడు :

ఈ భక్తుల కోర్కెలు నే నెంతవరకు తీర్చగలనో.

[బైటనుంచి జయజయ ధ్వనులు వినిపిస్తాయి. మళ్ళీ పాట]

మము జూడు నాయడా, మాలావుకొలది
మముజూడు బ్రహ్మన్న మా శౌర్యపటిమ
సింధురంబుల మీద చెన్నుగా దుమికి
కుంభ స్థలంబులు క్రుంగ జేసెదము
కొదమ సింగంబుల కూల ద్రోసెదము
గండభేరుండాల ఖండింతు మలుక
వాయువు బోనీక వడి నాపగలము
జాతవేదుని బట్టి చిదిమి వేసెదము
ఘనసముద్రము జొచ్చి కలగజేసెదము
కుంభిని కాళ్ళతో క్రుంగ దన్నెదము
కులగిరులైనను కొట్టివేసెదము
గురిజాల నేలెడు కువలయేశ్వరుని
కుల పగకై పట్టి క్రొవ్వడగించి
చలమును విడువక చంపగాగలము
మముజూడు నాయడా మాలావుకొలది
మముజూడు బ్రహ్మన్న మా శౌర్యపటిమ....

ఐతమ్మ :

వీళ్ళ వుత్సాహం చూస్తున్నకొద్దీ సంధి కుదురుకుందనే నమ్మకం పోతున్నది నాకు. మీరుకూడా ఆపలేరని అనిపిస్తూ వుంది.

బ్రహ్మనాయడు :

నా ప్రయత్నం నేను చేస్తాను.

ఐతమ్మ :

అబ్బ ! యింతమంది అమాయకజనుల మరణానికి

కారకురాలవుతూంటే ఆ నాయకురాలు ! ఎంత స్వార్థపరు రాలు !!

బ్రహ్మనాయడు :

అట్లనకు ఐతా ! ఆమెకు వర్ణాశ్రమధర్మాలలో నమ్మకము. చాపకూడనీ, సర్వమానవ సమానత్వమనీ, నేను వర్ణ సంకరం చేస్తున్నానని ఆమె భ్రమ. పలనాటిని వుద్ధరించటానికే తను కత్తిపడుతున్నానని ఆమె విశ్వసిస్తూవుంది. పైగా నేనుచేసే పనులన్నీ అధికారం కైవసం చేసుకోటానికి చేస్తూన్నాననీ, స్వార్థం నాదేననీ ఆమె వుద్దేశం.

[ కన్నమదాసు ప్రవేశం. వీరభూషణాలతో ఆలంకరింమకుని వుంటాడు. ]

ఐతమ్మ:

ఎవరా వచ్చేది ?

బ్రహ్మనాయడు :

సర్వసైన్యాధిపతి.

ఐతమ్మ :

ఆఁ... ! కన్నమదాసుకదూ !

బ్రహ్మనాయడు :

అవును. అతడే మన సర్వసైన్యాధిపతి.

ఐతమ్మ:

ఆహా ! మాలదాసరిని సర్వసైన్యాధి పతిని చేశారు. మీ సమదృష్టి ఎంతగొప్పది ! మీకు భార్యనైనందుకునేను ధన్యురాలను.

కన్నమనీడు :

బ్రహ్మనాయుడా ! కన్నమదాసు దణ్ణం.

బ్రహ్మనాయడు :

ఏమి సేనాపతీ !

కన్నమనీడు :

సేనలు బారులుతీర్చి వున్నాయి. తమరువచ్చి
గించండి.

బ్రహ్మనాయడు :

పద, సేనాపతీ - వస్తున్నాను.

కన్నమనీడు :

అమ్మా ! యుద్ధానికి పోతున్నాం. దీవించి పం:

ఐతమ్మ :

మంచిది నాయనా. జయం మీదే (కన్నీటితో
నిమురుతుంది. )

కన్నమనీడు :

జై ! చెన్నకేశవా ! ( వెళ్ళిపోతాడు )

ఐతమ్మ:

మహా సముద్రంలా వుప్పొంగి పోతున్నాడు.

బ్రహ్మనాయడు :

భక్తిలోవున్నది ఆ మహాత్యం.

ఐతమ్మ:

మీ శక్తి అనంతం. పలనాటి రాళ్ళ చేతకూడా మీరు పోట్లాడించగలరు.

బ్రహ్మనాయడు :

ఐతా ! బాలుని కనిపెట్టి వుండు. కోడల్ని మంచి చేసుకో. వెళ్లుతున్నాను.

ఐతమ్మ:

ఆఁ, చెన్నకేశవా ! ధర్మానికి జయం ప్రసాదించు.

[ బ్రహ్మనాయని నిష్క్రమణ. ఐతమ్మ చెమ్మగిలిన నయనాలను పమిటచెంగుతో తుడుచుకుంటుంది. ]

—[తెర]—

# రెండో అంకం

## మొదటి రంగం:

[మేడపిలో ఒక వీధి. స్త్రీలు నీళ్ళకడవలు బుజానపెట్టుకుని వెళ్తుంటారు. పురుషులు నీళ్ళకావిళ్ళు మోసుకొని వెళ్లుతుంటారు. మరికొందరు వాళ్ళవాళ్ళ పనులమీద వెళతుంటారు. ఒక యువకుడు హడావిడిగా ప్రవేశిస్తాడు.]

యువకుడు :

నాయని పుత్రుండు నవ మన్మథుండు
బాలుడు సంతోష భరితుడై యిపుడు
తమ్ములు తానును తన నేర్పుమీర
బొంగరాలాడగ పూని యున్నాడు
కనుగొని వత్తము గ్రక్కునబోయి.
రండి. రండి....

ఒక స్త్రీ :

రండి. రండి. వెళ్దాం. బాలుడటే. బొంగరాలాట ఆడుతున్నాడటే.

బ్రాహ్మణి :

రా, అన్నమ్మా! అందరూ వెడుతూవుంటే నువ్వలాగే నుంచున్నావేం? కదలకుండా? రా.

అన్నమ్మ :

నేను రానమ్మా. ఏమిటమ్మా చూసేది, బొంగరాలాట? తండ్రులంతా యుద్ధానికి వెళ్ళితే యీయనగారు ఎట్లాగైతేనేం ఒక బొంగరాలాట పెట్టుకూర్చున్నాడుటే.

బ్రాహ్మణి :

ఆ సంగతులన్నీ మన కెందుకు అన్నమ్మా! వాళ్ళు

ప్రభువులు. ప్రభువులు కాబట్టే ఏం చేసినా చెల్లుతూవుంది. మన కుటుంబాల్లోనే అయితే పెళ్ళాంమొహం చూడకుండా బోగందాన్ని పెట్టుకుని కూచుంటే పుట్టగతు లుండేవా ?

బ్రాహ్మణి :

సరేలే రద్దూ. ఎవరైనా వింటారు.

అన్నమ్మ :

ఇందులో ఎవరికి తెలియని రహస్యం ఏముంది ? ఆ మాంచాల పతివ్రత గనుక సరిపోయె. లేకపోతే తెలిసేది అబ్బాయి సంగతి !!

బ్రాహ్మణి :

వాళ్ళ కుటుంబ వ్యవహారాలు మన కెందుకు అన్నమ్మా ?

అన్నమ్మ :

ఇట్లా అనుకునే కొంపలమీదికి తెచ్చుకున్నాం. మొన్న మావాళ్లు వెచ్చాలుతెచ్చుకునే బండిచీల వూడదీసి పడద్రోశాడా ?... అంటే అన్నారంటారు గానీ, ఆడవాళ్ళు నీళ్లు తెచ్చుకునే రేవుదగ్గిర ఎప్పుడూ పీడికేం పని చెప్పా ?

బ్రాహ్మణి :

సరే. ఎందు కొచ్చిన గొడవ ! నీ కిష్టం లేకుంటే నువ్వుండు. నేను వెళ్ళివస్తా.

అన్నమ్మ :

ఇష్టం వున్నా లేకపోయినా నువ్వు వెళ్తే నాకు మాత్రం తప్పేదేముంది ? పద...

—[తెర]—

## రెండో రంగం:

[ గడ్డిగాల బావిదగ్గర బాలచంద్రుడు, అనపోతు, తమ్ములూ సహచరులు — బొంగరా లాడుతుంటారు. చూడవచ్చిన జనం చుట్టూ మూగి, కోలాహలం చేస్తుంటారు. బ్రాహ్మణి, అన్నమ్మ జనంలోకి వస్తారు. కాస్తదూరంలో వుండి చూస్తుంటారు. ]

ఒకడు :

అదుగో బాలచంద్రుడు వేదిక ఎక్కుతున్నాడు.

మరొకడు :

ఆహా ! ఏమి తేజస్సు ! ఆ ఠీవి, ఆ సౌరు! అరెరే!
[ ప్రజల కోలాహలం ] ఎవరది ?

ఒకడు :

అనపోతు. బ్రహ్మనాయని బ్రాహ్మణభార్య కొడుకు.

మరొకడు :

కులభేదమేగాని అంతా క్షత్రియులకుమల్లేనే వున్నారు.

మూడోవాడు :

ఏమిటాగోల? అనపోతు ఏమిటో మాట్లాడుతున్నాడు. విన నివ్వు.

అనపోతు :

బాలచంద్రా ! ఆట చూట్టానికి ప్రజలు తహతహ లాడుతున్నారు. నువ్వు ప్రారంభిస్తే మేము అందుకుంటాం.

బాలచంద్రుడు :

ఏదీ నా బొంగరం ?

బ్రాహ్మణి :

ఏమి బొంగరమే అన్నమ్మా! ధగధగ మెరిసిపోతున్నది!

అన్నమ్మ :

మలిదేవభూపతి చల్లగా వున్నంతకాలం వాళ్ళకేం? నవరత్నాలు తాపించుతాడు.

బ్రాహ్మణి :

ఆ జాలె చూడు. పాము చుట్టుకుంటున్నట్టు చుట్టుకుంటోంది బొంగరాన్ని.

అన్నమ్మ :

ఊఁ ముత్యాలతో అల్లించారు! వాళ్ళకేమైనా కిందూ, మీదూ తెలుస్తూవుందా?

బాలచంద్రుడు :

అనపోతూ! ప్రజలను దూరంగా నిలబడమని చెప్పు. నరవాసన ఎక్కువైతే నా బొంగరం మాట వినదు.

అనపోతు :

పదండి. ఊఁ. యింకా దూరంగా. బొంగరం తగిలితే మమ్మల్ని అని ప్రయోజనం లేదు. పెద్దలు తలపుకొస్తారు.

[ జనం కోలాహలం ]

అన్నమ్మ :

నే చెప్పలేదటే! మర్యాదా, మన్ననా? కొవ్వు కాక

పోతే వాడి మాట చూడు. వాడి బొంగరమట, నరవాసన ఎక్కువైతే మాట వినదట!

బ్రాహ్మణి :

ఊరుకో అన్నమ్మా! ప్రతిమాటకీ పెడఅర్థం తీస్తావు.

అనపోతు :

బాలచంద్రా! యిక కానివ్వు.

బాలచంద్రుడు :

ఇదుగో ప్రారంభిస్తున్నాను. (కాసేపు ఆట సాగుతుంది. జనం కోలాహలం. ఉద్రేకాలు పెరుగుతాయి) ఈ సారి చూడు, బొంగరం వెళ్ళి ఆ చట్రాతికి తగిలి, మళ్ళీ నా చేతులో వ్రాలి గిర్రునతిరగాలి. ఏమంటావ్ అనపోతూ?

అనపోతు :

కానివ్వు.

బాలచంద్రుడు :

ఇదుగో. ఊఁ (బొంగరం చట్రాతికి కొట్టుకున్న ధ్వని. వెంటనే అన్నమ్మ కెవ్వున కేక వేస్తుంది)

ఒకడు :

అయ్యయ్యో! బొంగరం అన్నమ్మ పాదంలోకి గుచ్చుకొనిపోయింది.

మరొకడు :

పాపం! కూలబడిపోయింది.

అన్నమ్మ :

అబ్బా! అయ్యో!! దేవుడా!!! (మూలుగుతూ మూర్ఛపోతుంది)

బ్రాహ్మణి :

అన్నమ్మా...... అన్నమ్మా......

ఒక స్త్రీ :

ఇంకెక్కడి అన్నమ్మ. బాంగరం ములికి కాల్లో నుంచి భూమిలోకి గుచ్చుకొనిపోతే! (జనం కోలాహలం)

బ్రాహ్మణి :

అయ్యయ్యో! రక్తం వరదలై పారుతోంది.

ఒకడు :

అడ్డంలేండి. కొంచెం గాలి తగలనివ్వండి.

మరొకడు :

నీళ్ళు! నీళ్ళు...

బ్రాహ్మణి :

అన్నమ్మా... అన్నమ్మా... నువ్వు రానన్నకొద్దీ తీసుకొచ్చాను. నీ అత్తమామల కిప్పుడు నే నేమనిచెప్పేది?

బాలచంద్రుడు :

(జనాన్ని తోసుకుంటూ) దారి యివ్వండి.

ఒకడు :

(గద్గదికంగా) చూశావా! బాలచంద్రా!

బాలచంద్రుడు :

అయ్యయ్యో! ఎంత పని జరిగింది. తాడు తెగిపోయి బొంగరం వశం తప్పిపోయింది. ఏమైనా స్త్రీని అవమానించా ననే అపవాదు నాకు తప్పదు.

మూడోవాడు :

యివిగో నీళ్ళు.

బాలచంద్రుడు :

మొహామ్మీద చిలకండి. స్పృహ వస్తుంది. తమ్ముడూ, దోర్నీడూ! బొంగరంలాగి రక్తం కడిగి కట్టుకట్టు.

[ దోర్నీడు ఆ ప్రయత్నంలో వుంటాడు,
అన్నమ్మ మూల్గుతుంది నెమ్మదిగా ]

బ్రాహ్మణి :

తేరుకుంటూ వుంది ... అన్నమ్మా ... అన్నమ్మా ...

అన్నమ్మ :

(మూలుగుతూ) అయ్యో! అయ్యో ! పీడి కడుపుడక. ఎంతపని చేశాడే. అమ్మా... ...అయ్యయ్యో, ప్రాణాలు లాక్కు పోతున్నాయి.

బాలచంద్రుడు :

అన్నమ్మా ! నన్ను క్షమించు. నీ కపకారం చెయ్యా లనే వుద్దేశంతో చెయ్యలేదు. ప్రమాదవశాత్తూ...

అన్నమ్మ :

నీ కావర మణగా ! యింకా నంగనాచి మాటలు

చెపుతున్నావా ? నా మీద గురిచూసి నువ్వు విసరలేదూ బొంగరం ?

బాలచంద్రుడు :

కోపంతో మంచీ చెడ్డా తెలియక మాట్లాడుతున్నావు గాని నిన్ను బాధ పెడితే నా కేం వస్తుంది ? అన్నమ్మా ! మా సంగతి మీ కందరికీ తెలియదూ ? మీ కళ్ళముందు పుట్టి పెరిగాం. యింత బ్రతుకూ బ్రతికి ఎన్నడైనా ఆడ వాళ్ళ నవమానిస్తామా ?

అన్నమ్మ :

అబ్బా ! అంత పత్తిత్తువా ? కట్టుకున్నది అహో రాత్రాలూ కుమిలి కుమిలి ఏడుస్తున్నా, ఆవిడగారి మొహమన్నా చూడకుండా సాని సబ్బాయి యింట్లో కులుకుతూ కూర్చునే బాలచంద్రుడివి కాదూ నువ్వు ?

బాలచంద్రుడు :

(కోపంతో) నోటి కొచ్చినట్లు ప్రేలకు.

అన్నమ్మ :

ఏం ? ఏం జేస్తావు ? (ఏడుస్తూ) కాలు విరగ్గొట్టారా! గొంతుకాయ కూడా పిసికెయ్యండి. పీడ విరగడౌతుంది... అయ్యయ్యో...అమ్మో...యీబాధ నేను సహించనరో ...ఊఁ... ...ఊఁ వీళ్ళ నోరుపడ... ...వీళ్ళ కుటుంబాలు నాశనంగాను.

బ్రాహ్మణి :

ఊరుకో అన్నమ్మా.

అన్నమ్మ :

ఏం వూరుకోకపోతే తలగొట్టి మొలేస్తాడా ? అంత ప్రతాపమే వుంటే తండ్రులతోపాటు యుద్ధానికే వెళ్లేవాడు. గాజులు తొడిగించుకుని యింట్లో ఎందుకూర్చుంటాడు ?

బాలచంద్రుడు :

యుద్ధమా ? (ఆశ్చర్యంగా) మా తండ్రులు యుద్ధాని కెళ్లారా ?

అన్నమ్మ :

మరి వెళ్ళలా ?

బాలచంద్రుడు :

ఎవరితోటి యుద్ధం ? ఎక్కడ ?

అన్నమ్మ :

ఏమో ఎక్కడో నాకేం తెలుస్తుంది ?

బాలచంద్రుడు :

అనపోతూ ...?

అనపోతు :

ఆశ్చర్యంగా వుంది !

బాలచంద్రుడు :

యుద్ధమైతే నా కెందుకు చెప్పలేదు !

అన్నమ్మ :

నీ కెందుకు చెప్పటం ? సాని సబ్బాయి యింట్లో వూరేగే వాడికి యుద్ధా లెందుకు ?

బాలచంద్రుడు :

ఆఁ ఏమన్నావ్ ? (పరవళ్ళు త్రొక్కుతాడు)

బ్రాహ్మణి :

రా, అన్నమ్మా. వెళ్దాం. కాస్త సాయం పట్టండి. (ఇతర స్త్రీల సహాయంతో బ్రాహ్మణి అన్నమ్మను తీసుకెళ్తుంది. అన్నమ్మ మూల్గుతూ, తిడుతూ క్రమంగా దూరమవుతుంది. బాలచంద్రుడు సాలోచనంగా శూన్యంలోకి చూస్తుంటాడు. ఉండి వుండి యిలా అంటాడు.)

బాలచంద్రుడు :

అనపోతూ ! విన్నావా ?...!

అనపోతు :

చాలా విచిత్రంగా వుంది.

బాలచంద్రుడు :

తమ్ముల కేమైనా తెలుసునేమో !

దోర్నీడు :

అబ్బెబ్బే! మాకేం తెలేదు. తెలిస్తే యింకా యిక్కడే వుండేవారమా ?

బాలచంద్రుడు :

కుర్రవాళ్ళ కెవరికీ తెలియకుండా వెళ్ళారు.

అనపోతు :

మనకు తెలేకుండా వెళ్ళాలనే కాబోలు సమయానికి మనల్ని వూళ్ళో లేకుండా చేశారు !

బాలచంద్రుడు :

నాకొక అనుమానం కలుగుతూ వుంది. వీడు కారం పూడికి దండెత్తివెళ్ళలేదు గదా !

అనపోతు :

(హఠాత్తుగా) అక్కడికే వెళ్ళివుంటారు బాల చంద్రా ! నాయకురాలు అలరాజును హత్యచేయించిందన్న వార్త తెలియగానే పెద్దలందరూ కలిసి చర్చలు జరిపారుట.

బాలచంద్రుడు :

మనకు చెప్పకపోవటానికి కారణం ?

అనపోతు :

అదే, అమ్మగార్ని అడుగుదాం పద. మనల్ని యిట్లా మోసం చేసి వెళ్ళటం చాలా అన్యాయంగా వుంది.

—[ తెర ]—

## మూడవ రంగం:

[ బ్రహ్మనాయని గృహం. ఐతమ్మ విచారంగా వుంటుంది. బాలచంద్రుడు, అనపోతు, వుద్రేకంగా వుంటారు. ]

ఐతమ్మ :

నేను చెప్పవలసింది చెప్పాను. మీ నాన్నగారి అభిప్రాయం కూడా యిదే. అప్పటికీ మీరు కాదుకూడదని పట్టుపడితే నేను కాదనగలనా బాబూ? ఈ పలనాటిని రక్షించవలసిన బాధ్యత పెద్దలకెంత వున్నదో పిన్నలకీ అంతే వుంది. అయితే వున్నవాళ్ళంతా యుద్ధానికే తరలితే, మన గ్రామంలోనే గగ్గోలు పుడుతుందేమోనని ప్రస్తుతానికి మిమ్మల్ని దిగబెట్టి వెళ్ళారు.

బాలచంద్రుడు :

ప్రజల్ని సురక్షితంగా చూట్టానికి నీవు లేవా అమ్మా? మమ్మల్ని దీవించి పంపు. నాశరీరంలోని ప్రత్యణువూ 'యుద్ధం యుద్ధం' అని కేరింతలు కొడుతున్నది. నేను లేకుండా యీ యజ్ఞం పూర్తి కాదు తల్లీ!

అనపోతు :

ఈ యుద్ధంకోసం యెన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్నామే! మా జీవితాలను యీ యుద్ధంకోసం మలుపుకుంటూ కూర్చున్నామే! మాకు చెప్పకుండా మమ్మల్ని విడిచిపెడతారా పెద్దలు?

బాలచంద్రుడు :

నీ దీవెనకోసం ఎదురుచూస్తున్నా నమ్మా !

ఐతమ్మ :

( కాసేపు ఆలోచించి ) మంచిది నాయనా ! చెన్న కేశవులే మీకు అండ.

బాలచంద్రుడు :

అమ్మా ! నీవు వీరపత్నివి. వీరమాతవు.

ఐతమ్మ :

బాబూ ! నువ్వు యుద్ధానికి వెళ్లటం నిశ్చయమైంది. వెళ్ళేముందు నాదొక కోర్కెవుంది. అది చెల్లించి వెళ్లు.

బాలచంద్రుడు :

చెప్పమ్మా! నీకోసం ఏదైనా చేస్తాను.

ఐతమ్మ :

(తల నిమురుతూ) ఇన్నేళ్ళనుంచి నీకోసం కనిపెట్టుకుని వుంది - మాంచాల. ఆమె నొకసారి పలకరించి వెళ్ళు నాయనా. (బాలచంద్రుడు కలవరపడతాడు)

ఐతమ్మ :

ఏం నాయనా! సందేహిస్తున్నావ్? (బాలచంద్రుడు మాట్లాడడు. అనపోతు అందుకుంటాడు)

అనపోతు :

మరేం లేదమ్మా. అన్నకు అభ్యంతరం వుండవలసిన

అవసరం లేదు. పెళ్ళి అయినతర్వాత యింతవరకు ఆ గడప త్రొక్కి ఎరుగడు గదా, యిప్పుడు వెళ్తే ఎలా చూస్తారో, ఏమనుకుంటారో ననే భయం అన్నకు.

ఐతమ్మ :

పిచ్చితండ్రీ ! నిన్ను చూసి పుప్పొంగిపోతుంది మాంచాల. తన జన్మ తరించిం దనుకుంటుంది.

— [ తెర ] —

# మూడో అంకం
## మొదటి రంగం :

[ మేడపిలో మాంచాల మందిరం. దేవుని గది. చెన్నకేశవుని విగ్రహంముందు మాంచాల పూజ చేసుకుంటూ వుంటుంది. ]

మాంచాల :

ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు
ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు
ఇన్నాళ్ళగ తలవాకిలి
యిల్లై తపియించుట....ఎన్నాళ్ళకు, ఎన్నాళ్ళకు
ఈప్సితము ఫలించుట
ఎన్నాళ్ళకు నా స్వామిని
కన్నారగ కాంచుట ఎన్నాళ్ళకు, ఎన్నాళ్ళకు.

[ గది బయటనుండి రేఖాంబ 'అమ్మాయీ ! మాంచాలా' అని పిలుస్తుంది ]

మాంచాల :

వస్తున్నా నమ్మా.

[ దేవునికి హారతిచ్చి బైలుదేరుతుండగా రేఖాంబ ప్రవేశిస్తుంది ]

రేఖాంబ :

అమ్మా (కూతురు ముఖంలోకి చూసి కౌగలించుకొని) నేటికి నా తల్లి నోములు ఫలించినయ్.

మాంచాల :

ఏం జరిగిం దమ్మా! యుద్ధ విశేషాలేమన్నా తెలిసినవా?

రేఖాంబ :

లేదు తల్లీ. మీ అత్తగారిప్పుడే కబురుచేశారు. అల్లుడుగారు రేపు మనయింటికి వస్తారట.

మాంచాల :

(తన్ను తాను నమ్మకుండా) ఏమిటమ్మా! (తల్లి నవ్వు ముఖంచూసి తల వంచుకుని) నిజమా అమ్మా?!

రేఖాంబ :

(కూతురు తల నిమురుతూ) నిజం తల్లీ. నేను వసారాలో పనిచేసుకుంటూ వుంటే, మీ అత్తగారి దగ్గరనుంచి మనిషి వచ్చాడు. నేను ఎందుకో అనుకున్నా. "రేపు మీ అల్లుడుగారు వస్తారని దొరసాని చెప్పమంది" అని వాడు చెప్పే సరికి నా చెవుల్ని నేనే నమ్మలేక పోయా. మళ్ళీ మళ్ళీ అడిగా. మళ్ళీ మళ్ళీ చెప్పించుకున్నా. రేపు మీ ఆయన వచ్చేమాట నిజం తల్లీ!

మాంచాల :

అమ్మా! (తల్లిని కౌగలించుకుని, రొమ్ముమీద తల వాల్చి, అశ్రువులు రాలుస్తూ) నేను నమ్మలేకుండా వున్నానమ్మా, నా కంత అదృష్టమా?...అయ్యో...

రేఖాంబ :

(కూతురు తల నిమురుతూ) నిజం తల్లీ! రవ్వంత అనుమానం కూడా లేదు. ఆయన వచ్చేమాట నిజం.

మాంచాల :

[తల్లిని వదలి చెన్న కేశవుని ముందుకు వెళ్ళి భక్తితో కూచుంటుంది.]

నా మొరాలకించవా, చెన్నకేశవా ?
ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు
ఎన్నాళ్ళకు నా స్వామిని
కన్నారగ కాంచుట
సన్నజాజి విరిసరములు
స్వాగత మర్పించుట—ఎన్నాళ్ళకు, ఎన్నాళ్ళకు ! !

కేశవస్వామీ నీ మేలు మరువను. ఈ దీనురాలి మొరాలకించావు.

[ఆమె పాడుతూ వుండగా తల్లి రేఖాంబ ఆనందాశ్రువులు తుడుచుకుంటూ మధ్య మధ్య ఏదో ఆలోచించుకుంటూ వుంటుంది. పాట పూర్తవగానే కుమార్తెను దగ్గరకు తీసుకుని]

రేఖాంబ :

ఆ వచ్చిన మనిషి మరొక మాటకూడా చెప్పాడమ్మా.

మాంచాల :

ఏమిటమ్మా అది ?

రేఖాంబ :

తన తల్లి ఎంత చెప్పినా వినకుండా అల్లుడు గారు యుద్ధానికి బైలుదేరారట

మాంచాల :

ఆహా ! నేడుగదా నేను వీరపత్నిని.

రేఖాంబ :

వెళ్ళబోయ్యే ముందు నిన్నొకసారి చూసి వెళ్ళటానికి వస్తున్నారట.

మాంచాల :

ఎంత దయ!

రేఖాంబ :

అమ్మా! రాకరాక వస్తున్నారు. ఆయనన్న కొంత కాలం వుండేటట్టు చెయ్యటం నీ వంతు.

మాంచాల :

[ఆశ్చర్యంగా] అమ్మా!...యుద్ధానికి బైలుదేరిన వారిని...

రేఖాంబ :

అవును తల్లీ. రావటమే యిన్నాళ్ళకు. ఈయన వెళ్ళకపోతే మాత్రం యుద్ధానికి లోటా? పల్నాటిలో వున్న నాయకు లంతా అక్కడే వుండిరి. మీ మామగారిని మించి యీయన పోతే మాత్రం చేసే దేముందమ్మా? నా మాట విని వారి నాపగలిగావా, నిన్న కన్నందుకు నా జన్మకూడ చరితార్థ మవుతుంది.

మాంచాల :

(సాలోచనగా) పలనాటికి యిది పరీక్షాసమయం. ఒకప్రక్క పలనాటి మాత తన బిడ్డ లందరి సహాయం కోరు తోంది. మరొకప్రక్క వారు రాకరాక వస్తున్నారు. నేనేం

చెయ్యను ? వారికీ, యుద్ధానికీ ఎట్లా అడ్డుగా నిలువను ? నా సౌఖ్యంకోసం పలనాటిమాతపిలుపుకు కలిగే ఆయన హృదయ స్పందనాన్ని ఎట్లా ఆపను ?

రేఖాంబ :

ఇది నాకోర్కె కాదమ్మా. మీ అత్తగారి కోర్కె కూడా. ఆ వచ్చిన మనిషి, మాంచాలకు చెప్పి బాలుణ్ణి యుద్ధానికి వెళ్ళకుండా ఆపుచెయ్యమని మీ అత్త చెప్పమన్న దని చెప్పాడు... ఆలోచించుకో అమ్మా... ఈయన్ను ఆపటం మనందరికి మంచిదని నా అభిప్రాయం. ఆయన రేపు వస్తున్నాడు. చెయ్యవలసిన పనులు చాలా వున్నాయి. వస్తా.

( రేఖాంబ నిష్క్రమణ )

మాంచాల :

( ఒక్క క్షణం నిర్విణ్ణురాలై నిలబడి చెన్నకేశవుని విగ్రహం దగ్గర) చెన్నకేశవా ! నా కేదిదారి ? నాకెందుకు ప్రభూ! యింత విషమ పరిస్థితి కల్పించావు. పుట్టినప్పుడే పల నాటి మాత దివ్యమంగళ విగ్రహాన్ని నా హృదయంలో ప్రతిష్ఠించావు. ఊహ వచ్చినప్పటి నుంచీ మామగారి సమా నత్వ సిద్ధాంతంతో నా మనస్సును ప్రజ్వలింప జేశావు. నా బ్రతుకును యీ రెంటిలో నింపివేశావు. యీ రెంటికోసం జరిగే యీ యజ్ఞంలోకి వెళ్ళకుండా వారిని ఎట్లా ఆపను ప్రభూ !!

—[ తెర ]—

## రెండో రంగం:

[మాంచాల గది. మాంచాల సాలోచనగా పూలదండ గ్రుచ్చు తుంటుంది. ఆమె అలంకారం పూర్తయి వుంటుంది. దండ గ్రుచ్చటం కూడా పూర్తి కావస్తుంటుంది. ఆమె తనలో తాను యీ విధంగా పాడు తుంటుంది.]

ఇన్నాళ్ళకు నా స్వామిని
కన్నారగ కాంచుట
పలనాటికి కాపు సేయ
వలపు త్రుంప జాలనేని
వెలయాలికి తులయని నిం
దలు పడు తలపైని నాకు.
పతిదేవుని రణ దీక్షమతి నొనరించెదను గాక!
క్షితిని వీరపత్ని నన్న నుతి వెలయించెదను గాక !!

రేఖాంబ :

[ఆతురతగా ప్రవేశించి] ఇంకా పూర్తికాలా అమ్మా ! అల్లుడుగారు వస్తున్నారు.

మాంచాల:

ఆఁ ! వస్తున్నారా !! ఏవీ పువ్వులు?...దండెక్కడ? ...గంధం ఏదీ ?...పన్నీరు ?...అయ్యో ఏవీ కనపడవేం ?

దాసి :

[ప్రవేశించి] అల్లుడుగారు వాకిట్లో నుంచున్నారు.

మాంచాల :

వచ్చారా ?...ఒక్కరే వచ్చారా ?

దాసి :

లేదమ్మా? తమ్ముళ్లందరితోనూ వచ్చారు. కోట ముట్టడించటానికి వచ్చిన సైన్యంలా వున్నారు. కాళ్ళకు నీళ్లిచ్చి వసారాలో కూర్చోబెట్టి వచ్చాను.

మాంచాల:

అమ్మా, వారిని నే నెన్నడూ చూడలేదుగద, ఎలా గుర్తు పట్టటం?

రేఖాంబ :

పిచ్చి తల్లీ! ఎందుకంత కంగారు పడతావు? నిన్ను చూడగానే నీ మరదు లందరూ లేచి నిలబడతారు, నీ భర్త లేవడు.

—[తెర]—

# మూడో రంగం

[వసారాలో బాలచంద్రుడూ, అనపోతూ, తమ్ములు కూర్చొని వుంటారు]

అనపోతు :

ఏమిటి బాలచంద్రా! ఆలోచిస్తున్నావు?

బాలచంద్రుడు :

ఎప్పుడో పెండ్లికి చూశాను యీ యిల్లు. అప్పటికీ, యిప్పటికీ ఏమీ మార్పు లేదు.

అనపోతు :

నీవు రాకపోవడంవల్ల మార్పుకి అవసరంలేకుండా పోయింది. (బాలచంద్రునితో ఆలోచిస్తూ కూచుంటారు. కొంచెంసేపు నిశ్శబ్దం)

బాలచంద్రుడు :

ఇంతకీ యింట్లో ఎవరైనా వున్నట్లా, లేనట్లా? అలికిడి లేదు.

అనపోతు :

అలికిడి ఎలావుంటుంది? వున్న మొగవాళ్ళంతా యుద్ధానికి పోయిరి.

బాలచంద్రుడు :

ఎంతపని జరిగింది అనపోతూ! మొగవాళ్ళమై యుద్ధానికి వెళ్ళనిది మనమే. (నిశ్శబ్దం) అసలు నాకీ వివాహం యిష్టంలేదు. తల్లి ఒత్తిడివల్ల జరిగింది.

[పూలమాలతో మాంచాల యింట్లో నుంచి ప్రవేశం. తలుపుదగ్గిర రేఖాంబ ఆగుతుంది]

అనపోతు :

అదుగో వదినెగారు. పూలదండ చేతిలో పట్టుకొని యిటే వస్తున్నారు.

బాలచంద్రుడు :

ఆఁ! యీామె మాంచాలా? (తన కన్నులు తానే నమ్మలేక చూస్తుంటాడు)

అనపోతు :

తమ్ముళ్ళూ, లేవండి. వదినగారు.

రేఖాంబ :

(తలుపు చాటునుంచి చూస్తూ) అయ్యో, అల్లుడు గారు, అనపోతూ, యిద్దరూ శివలేదు. అమ్మాయి, భర్త నెలా గుర్తించటం? భర్త అని భ్రమపడి అనపోతు మెడలో దండ వేస్తుందే!... ఆఁ... ఆఁ... (మాంచాల అనపోతు మెడలో దండ వెయ్యబోతుంది)

అనపోతు :

ఆఁ, ఆఁ... నేను మీ బ్రాహ్మణ మరదిని. అనపోతుని. యితడూ బాలుడు. నీ భర్త.

మాంచాల :

[వెంటనే కోలుకుని] ముందు బ్రాహ్మణులను గౌరవించటం మా సంప్రదాయం.

అనపోతు :

మీరు పాటించవలసినది శీలంవారి సంప్రదాయం. వారి వంశంలో ప్రథమ పూజ భర్తదే.

మాంచాల :

విప్రులు చెప్తున్నారు....

రేఖాంబ :

ఆహాఁ...నా బిడ్డ ఎంత చమత్కారంగా తప్పుకుంది ? అదుగో భర్త మెడలో పూలమాల వేసింది. నా జన్మ తరించింది.

బాలచంద్రుడు :

(పారవశ్యంతో) మాంచాలా !...

మాంచాల :

ధన్యురాలను. (బాలచంద్రుడు మాంచాల అందాన్ని కన్నులతో గ్రోలుతూ, తన్ను తాను మరచిపోయి వుంటాడు. అనపోతు గ్రహిస్తాడు.)

అనపోతు :

బాలచంద్రా ! మేము వెళ్ళివస్తాం. ఏడుజాములకంటే యిక్కట వుండటానికి వీల్లేదు. అపకీర్తి రానివ్వకు. వదినగారూ ! మీకు తెలియనిది లేదు. ఊరిబైట అన్నగారికోసం ఎదురుచూస్తూ వుంటాం.

[బాలచంద్రుడూ, మాంచాల చూస్తుంటారు, అనపోతు, మిగిలినవారు నిష్క్రమిస్తారు. బాలచంద్రుడు మాంచాలవైపుకు తిరుగుతాడు.]

బాలచంద్రుడు :

మాంచాలా ! నీకు నేనెంత అపచారం చేశాను.

[ మాంచాల సిగ్గుతో తల వంచుకుంటుంది. తలుపు చాటునవున్న రేఖాంబసంతోషంతో పూగిపోతుంది. ]

—[ తెర ]—

## నాలుగో రంగం:

[ఆ రాత్రి మాంచాల శయనాగారంలో, ఒకరి నొకరు ఆనుకుని కూర్చునివుంటారు. కోడి కూస్తుంది. మాంచాల వులిక్కి పడుతుంది.]

మాంచాల :

అప్పుడే తెల్లవారవచ్చింది.

బాలచంద్రుడు :

పోనీ... తెల్లవారనియ్.

మాంచాల :

(ఆతురతతో) మీ తమ్ముళ్లు పెట్టిన గడువు సమీపిస్తోంది స్వామీ!

బాలచంద్రుడు :

రానీ...

మాంచాల :

అదేమి మాట స్వామీ... ?

బాలచంద్రుడు :

నేను నిర్ణయించుకున్నాను మాంచాలా! ఇన్నాళ్ళూ అమూల్య రత్నాన్ని వదలుకొని గులకరాయి వెంట బడ్డాను. చేజిక్కిన ఆ రత్నాన్ని నే నిప్పు డేపరిస్థితుల్లోనూ వొదులుకో దలచుకోలేదు మాంచాలా!

మాంచాల :

స్వామీ!

బాలచంద్రుడు :

అవును మాంచాలా !

మాంచాల :

యుద్ధం సంగతి మరచిపోతున్నారు.

బాలచంద్రుడు :

యుద్ధంకాదు. బ్రహ్మరుద్రాదులు కూడా నన్ను నీ నుంచి వేరు చెయ్యలేరు.

మాంచాల :

అయ్యో చెన్నకేశవా! యింకేది దిక్కు !! స్వామీ... పలనాటి మాతవైపు ఒక్కసారి దృష్టి ప్రసారించండి. మామ గారి చాపకూటిని ఒక్కసారి స్మృతిపథానికి తెచ్చుకోండి. ఈయుద్ధంలో ఒకవేళ నాయకురాలే గెలిస్తే పలనాటికి జరిగే సర్వనాశనాన్ని గుర్తుకుతెచ్చుకోండి. కులతత్వాలు రెచ్చి పోతవి. ద్వేషాలు పెరుగుతవి. దోపిడీలు విజృంభిస్తవి. ... స్వామీ అదుగో అటుచూడండి... పలనాటిమాత కన్నీటితో మిమ్మల్ని ప్రార్థిస్తూవుంది. అదిగో కారంపూడి కదనరంగం. అదుగో పలనాటి వీరులు. అదిగో మామగారి ఆరాధ్య దేవత... అందరూ మీ కోసమే ఎదురుచూస్తున్నారు. మీ కోసమే కనిపెట్టుకుని వున్నారు.

బాలచంద్రుడు :

(విసుగ్గా) మాంచాలా... ( మాంచాల ఆగుతుంది ) నన్ను యుద్ధానికి ప్రేరేపించకు. నామనస్సు వికలంచెయ్యకు. ప్రస్తుతం నాకు నువ్వుతప్ప మరేమీ కనిపించటం లేదు.

మాంచాలా... నీకు నేనెంతో అపచారంచేశానే... దానికి ప్రాయశ్చిత్తం చేసుకోనివ్వు. నాకోసం దినమొకయుగంగా గడిపావే... దానికి తగినపారితోషికం నన్ను యివ్వనివ్వు...

మాంచాల :

పలనాటి విచ్ఛిత్తికి మాంచాల కారణమనే నింద నా మెడకు అంటగట్టదలిచారా స్వామీ ?...

బాలచంద్రుడు :

లేదు మాంచాలా. యిప్పుడు పలనాటికివచ్చే నష్టం ఏమీలేదు. ఈ యుద్ధంలో ఎవ్వరు పాల్గొన్నా పాల్గొనక పోయినా నాన్నగారికి జయం తప్పదు.

మాంచాల :

నాయకురాలు సామాన్యురాలుకాదు స్వామీ! 'వర్ణాశ్రమ ధర్మరక్షణ' అని చెప్పి, మామగారు చాపకూడు నెపంతో వర్ణసంకరం చేస్తున్నారని చెప్పి, తన అనుచరుల్లో వీరావేశం పెంచివుంది. ధర్మావేశంతో ఆమె సైన్యాలు కదంత్రొక్కుతున్నవి. ఒళ్లుమరచి యుద్ధం చేస్తయ్ ...

బాలచంద్రుడు :

అయితే మన సైన్యాలు తక్కువా ? నాయకురాలికి యెన్నైనా వుంటే వుండవచ్చుగాని బ్రహ్మనాయుడు లేడు. ఆ ఒక్క లోటు చాలదా, ఆమె ఓటమికి ?

మాంచాల:

మీకు నేను చెప్పేఅంతదాన్ని కాదుగాని మామ గారికీ, నాయకురాలికీ ఒక భేదం వుంది స్వామీ. మామ

గారు బ్రహ్మవేత్తలు. మానవమాత్రులుగా పుట్టబట్టి, తమ విధ్యుక్తధర్మం నెరవేర్చుకోటానికి కత్తి పట్టారుకాని స్వతః ఆయనకు జననష్టం గిట్టదు. నాయకురాలు అలాకాదు. తన యత్నంలో పలనాడు నాశనమైనాసరే, సర్వం దగ్ధం అయినా సరే ఆమె తటపటాయించదు. తాను గెలవటమే ఆమెకు ముఖ్యం. మామగారు ఆమెకు తగిన వుజ్జీకాదు. ఆమెకు తగిన వుజ్జీ మీరే.

బాలచంద్రుడు :

(ఆమె మాటలు నింపాదిగా విని) నేను ఏంచెయ్యాను...? నేను యెప్పుడూ సౌందర్యానికి దాసుడనే. నిన్ను చూసి నప్పటినుంచీ, నా మనస్సులో యింకొక ఆవేశానికి స్థానమే లేకుండా పోయింది మాంచాలా! నాకు నీవే పలనాటివి. నీవే కదనరంగానివి, సర్వమూ నీవే.

(ఇంటి ముంగిటనుంచి 'బాలచంద్రా, బాలచంద్రా !.... నిన్నే నోయి....వెంటనే బయలు దేరాలి'.... అని కేకలు)

బాలచంద్రుడు :

ఎవ్వరది ? ఎవ్వరా మూర్ఖులు ?

మాంచాల :

కోపగించకు స్వామీ! మీ తమ్ములు......మీ ధర్మాన్ని మీకు జ్ఞాపకం చెయ్యటానికి వచ్చారు...... నామాట వినండి...

[బాలచంద్రుడు కోపంతో వణికి పోతుంటాడు. బయట నుంచి కేకలు ఎక్కువవుతై. "బాలచంద్రా ! గడువు

దాటిపోతూ వుంది. వెంటనే బైలుదేరకపోతే యుద్ధానికి అందుకోలేము. వస్తావా? రావా?"]

బాలచంద్రుడు :

(కోపంతో) యిదుగో వస్తున్నాను. (బాకు లాగి) సమయా సమయాలు తెలియని మీబోటి మూర్ఖులను మీ మీ ఉచిత స్థానాలకు పంపటానికి యిదే వస్తున్నాను.

[బైలుదేరుతాడు రౌద్రావేశంతో]

మాంచాల:

స్వామీ ...... ...

[ఎదుర్కొన్న ఆమెను తోసివేసి నిష్క్రమిస్తాడు. మాంచాల ఒక్క క్షణం ఆలోచిస్తుంది. ఆమె చూపులు గోడకు వ్రేలాడుతున్న భైరవ ఖడ్గంమీద వాలుతై.]

—[తెర]—

# ఐదో రంగం:

[మాంచాల మందిర ప్రాంగణం. అనపోతూ, తిమ్మలూ, కదన రంగానికి తయారయివుంటారు]

అనపోతు :

నేను అనుకున్నంత పనీ చేశాను. బాలచంద్రా బాలచంద్రా !

[బాలచంద్రుడు వీరావేశంతో బాకు చేత్తో పట్టుకుని ప్రవేశిస్తాడు]

బాలచంద్రుడు :

మీాకు బుద్ధిలేదు. ఏమిటీ కేకలు?......యిదే సమయం ?

అనపోతు :

ఏమిటి నువ్వు మాట్లాడేది బాలచంద్రా ! యు సంగతి అప్పుడే మరచి పోయావా ఏమిటి ?

బాలచంద్రుడు :

ఆ సంగతి మీాకు అనవసరం. మీాకు ప్రాణాలమీ ఆశ వుంటే తక్షణం యిక్కడనుంచి పొండి.

అనపోతు :

ఏమిటీ అన్యాయం బాలచంద్రా? మనం బైలుదే దేనికి ? యిప్పుడు నువ్వు మాట్లాడేది ఏమిటి ? ఒక ప్ర సంకుల సమరం ప్రారంభ మవుతూ వుంటే నీకు భార్య కులుకుతూ కాలక్షేపం చేద్దామని ఎట్లా ఉద్దేశం కలి బాలచంద్రా !

బాలచంద్రుడు :

అనపోతూ ! అధిక ప్రసంగం చెయ్యకు.

అనపోతు :

అయితే యుద్ధానికి రావా ?

బాలచంద్రుడు :

మీకు జవాబు చెప్పవలసిన బాధ్యత నాకు లేదు.

అనపోతు :

అవున్లే. వేశ్యకోసం భార్యను విడిచిపెట్టిన వానికి భార్య కోసం దేశాన్ని విడిచిపెట్టటం ఒక లెక్కా !!

బాలచంద్రుడు :

(కోపంగా) అనపోతూ, నీ చావును నీవే కోరి తెచ్చుకున్నావు ( బాకు పైకెత్తుతాడు )

మాంచాల :

( భైరవ ఖడ్గంతో ప్రవేశించి ) స్వామీ... ఆగండి.

బాలచంద్రుడు :

(తిరిగి చూసి ) ఏమిటిది మాంచాలా ?... యిక్కడి కెందు కొచ్చావు ?

మాంచాల :

( ఖడ్గం అందిస్తూ ) యిదుగో మీ భైరవఖడ్గం. పలనాటిమాత ఎప్పుడు సర్వాంగశోభితంగా వర్ధిల్లుతుందా,

ఎప్పుడు మామగారి సర్వసామ్య సిద్ధాంతం సర్వవ్యాప్తమవు తుందా అని ఒళ్ళంతా కన్నులు చేసుకుని కూర్చున్నాను. ఈ దీనురాలి కోర్కెను తీర్చండి. విజయులై తిరిగిరండి.

[ అంతా నిర్విణ్ణులై మాంచాలను చూస్తూవుంటారు. తలుపుచాటు నుంచి, చూస్తున్న రేఖాంబ చెమ్మగిలిన కండ్లను తుడుచు కుంటుంది. బాలచంద్రుడు 'మాంచాలా' అంటూ విస్తుపోతాడు. ]

మాంచాల :

నన్ను క్షమించండి. పల్నాటిభవిష్యత్తు నిర్ణయింపబడే యుద్ధానికి మాంచాల వ్యామోహం అడ్డుపడిందనే అపనింద నాకు రానీయకండి. మిమ్మల్ని తనివితీరచూశాను. మీ హృదయంలో నాకున్న స్థానాన్ని గ్రహించాను. ఈక్షణమే నాకొకయుగం. మీరులేకుండా పలనాటిభవిష్యత్తు నిర్ణయింపబడటం అపహాస్యం. ( భైరవఖడ్గ మందించి ) మామగారి సర్వసామ్య సిద్ధాంతాచరణ మీవల్ల జరగాలని నేను అపేక్షిస్తున్నాను. మీరు చెల్లించవలసిన నాకోర్కె యిదొక్కటే... ... ...

రతిరాజ సుందరా. రణరంగధీర !
కమలబాంధవ తేజ, కరుణాలవాల
వినతాత్మజుని లావు వెసనీకు కలుగు
సామీరికుండిన సాహసంబబ్బు
కృష్ణునికీడుగా కీర్తిఘటిల్లు
రవికాంతి యుతుడవై రంజిల్లుచుండి
పటుతర విక్రమ వైభవం బలర

శాత్రవ విజయంబు సమకూరుమీకు
కలియుగంబున మీకు ఘనపూజ లమరు.

అనపోతు :

వదినెగారూ ! మీరు వీరపత్నులు. మిమ్మల్ని కని పలనాడు ధన్యమైంది.

[ మాంచాల తలవంచుకొని భర్త ప్రక్కకు జరుగుతుంది. ]

బాలచంద్రుడు :

మాంచాలా ! నీకు కృతజ్ఞుణ్ణి. ఇక విజయం మనదే! ఈనాటినుంచి నాయనగారి సర్వసామ్య సిద్ధాంతం దేశవ్యాప్తంగా చిరస్థాయిగా వర్ధిల్లటానికి నేను చెయ్యని త్యాగముండదు. వెళ్తున్నాను. వెళ్తున్నాను. ఏనాటికైనా నీఋణం తీర్చుకో గలనో లేనో !!

మాంచాల :

ఋణపడింది నేను స్వామీ... స్వామీ... ...(కాళ్ళ మీదకు వ్రాలి కన్నీరు కారుస్తుంది. బాలచంద్రుడు నెమ్మదిగా లేవనెత్తుతాడు.)

అనపోతు :

వదినగారూ! మీ జన్మ ధన్యమైనది. పలనాటిని రక్షించిన గౌరవం మీదే. పలనాటి వీరచరిత్రలో మీ పవిత్రనామం సువర్ణాక్షరాలతో లిఖిస్తారు. శెలవు.

మాంచాల :

సర్వసామ్య సిద్ధాంతం చిరస్థాయిగా వర్ధిల్లుగాక!
(బాలచంద్రుడు, అనపోతు, తమ్ములు, నిష్క్రమిస్తారు.)

మాంచాల :

(కన్నుల నీరు నింపుకొని) పలనాటి మాత యెంత అదృష్టవంతురాలు !!

రేఖాంబ :

(దగ్గరకు వచ్చి) నాకంటేనా తల్లీ! (కౌగలించుకొని) నా తల్లిని కని నా కడుపు పండింది. చిన్నదానివి- నీకున్న జ్ఞానం నాకు లేకపోయిందమ్మా. నువ్వు చేసినపనికి మాబోటి వాళ్ళ దేముంది ? దేవతలే హర్షిస్తారు.

మాంచాల :

అమ్మా ! పల్నాటిలో స్త్రీలు యుద్ధానికి వెళ్ళే ఆచారం లేదా అమ్మా ?

రేఖాంబ :

లేకేం తల్లీ ! పలనాటి పౌరుషం అసలు స్త్రీలదే. స్త్రీలనుంచే పురుషుల కబ్బింది.

[తల్లి చెపుతోంటే, మాంచాల ఎక్కడో ఆలోచిస్తూ వుంటుంది.]

—[తెర]—

# నాలుగో అంకం

## మొదటి రంగం:

[కారెమపూడి కదనరంగం. మలిదేవ భూపతి శిబిరం. మలిదేవ భూపతి చుట్టూ, బ్రహ్మనాయడు, కొమ్మరాజు, కన్నమదాసు, గండు కన్నమ, మొదలైన యోధులు పరివేష్టించి వుంటారు.]

మలిదేవ భూపతి :

బ్రహ్మన్న మంత్రీ! ఇక జరుగవలసినది ఆలోచించు.

బ్రహ్మనాయడు :

పలనాటి రక్తపుబొట్టు యెక్కడ చింది భగ్గుమంటుందో అని సంధికోసం శాయశక్తులా ప్రయత్నించాను. కాని ఫలించలేదు. ఇక యుద్ధం తప్పదనుకొంటాను. కొమ్మరాజుగారి అభిప్రాయం యేమిటో?

కొమ్మరాజు :

నా కుమారుని హత్యచేసిన నరసింగరాజు తల కొట్టేదాకా నాకు నిద్రపట్టదు.

బ్రహ్మనాయడు :

ఏమి సేనాపతీ?

కన్నమదాసు :

రణానికి కాలు దువ్వుతున్న సైన్యాలను మూడు నెలలనుంచీ ఆపుకు వస్తున్నాను. ఇక నా వల్లగాదు.

బ్రహ్మనాయుడు :

సరే. సభాసదులారా! మీలో ఎక్కువ మందికి యిష్టం లేకపోయినా జనస్థానికి వెరచి అనేకవిధాల సంధి కోసం ప్రయత్నించాను. కాని నాయకురాలు పడనిచ్చింది కాదు. పైగా మనం రాయబారం పంపిన భట్టుని తృణీకరించి అవమానించింది. 'భట్టువాడివి కనుక బ్రతికిపోయావు. లేక పోతే ఏనుగులచేత త్రొక్కించేదాన్ని' అన్నదట. భట్టు చెప్పిన మాటలనుబట్టి నలగామభూపతికి తమ్ముళ్లమీద ఏమాత్రం వాత్సల్యం వున్నట్లు కనపట్టంలేదు. "మీకు సేనలులేవు. సేనాధిపతిలేడు. ఆయుధాలు లేవు. వాహనాలు లేవు. మీశిబిరమంతా మాచింతచెట్టు క్రిందికి చాలదు. ఏం చూసి మీతో సంధి చేసుకోవాలి? మీకు ప్రాణాలమీద తీపివుంటే బాలరాజుని తీసుకుని, వచ్చినదారిని పట్టండి" అని చెప్పాడు. పరిస్థితులు యిలావున్నాయి. కర్తవ్యం చెప్పండి.

కన్నమనీడు :

ఎందుకు బ్రహ్మనాయుడా! యీ ఆలస్యం? ఎక్కడ యుద్ధానికి అందుకోలేమో అని త్వరపడివచ్చాం. యిక్కడికి వచ్చి అప్పుడే మూడునెల లయింది. యిదుగో, అదుగో అని కాలయాపన చేస్తున్నావేగాని, యుద్ధం మొగవనివ్వవు.

కొమ్మరాజు :

రోజులు గడిచిపోతున్నాయి. నరసింగరాజు మాత్రం యింకా రొమ్ములు విరుచుకు తిరుగుతూనే వున్నాడు, బ్రహ్మన్నమంత్రీ! రాత్రి అలరాజు మళ్ళీ కలలో కని

పించాడు. 'తండ్రీ' అని కళ్ళవెంట నీళ్ళు పెట్టుకున్నాడు. పేరమ్మ తలవిరబోసుకుని "నా కీగతి కల్పించినవాళ్ళకి ప్రాయశ్చిత్తం లేదా" అంటూ అడిగింది.

సభికులు :

యుద్ధం ప్రకటించండి...... యుద్ధం... ఎందుకు మీరు మమ్మల్ని యిక్కడికి తీసుకొచ్చింది ? ... యిట్లా మమ్మల్ని ఎంతకాలం ఆపుతారు?...

బాదన్న :

ప్రభూ ! యింకా ఆలస్యంచేయటం ప్రమాదం.

మలిదేవభూపతి :

తొందరపడ్డామని యిక చరిత్ర మనల్ని నిందించదు. మలిదేవుడు అన్నమీదకు రాజ్యకాంక్షతో కత్తికట్టాడని అనదు. జననష్టానికి బాధ్యత యిక మనదికాదు బ్రహ్మన్న మంత్రీ !

బ్రహ్మనాయడు :

సేనాపతీ! సైన్యాలను ఆయత్తపరచు?

కన్నమదాసు :

కలహానికి కాలుదువ్వుతున్నాయి. ఎప్పుడెప్పుడని దూకుతున్నాయి. జై మలిదేవభూపతికీ జై... జై... బ్రహ్మన్న మంత్రికీ... జై... చాపకూడు సిద్ధాంతానికీ జై......

[సభికులు అందుకుంటారు. వీరుల జయజయ ధ్వానాలమధ్య బైటనుంచి సేవకుని ప్రవేశం ]

సేవకుడు :

దేవరదర్శనం కోసం, నాయకురాలి దగ్గరనుండి రాయబారి వచ్చాడు.

బ్రహ్మనాయుడు :

ఏమి !

మలిదేవ భూపతి :

రాయబారియా ? !!

కొమ్మరాజు :

నాయకురాలి దగ్గిరనుంచా ! ! !

[సభికులందరూ ఒకరి మొఖం ఒకరు చూసుకుంటారు.]

మలిదేవ భూపతి :

ప్రవేశపెట్టు. (సేవకుడు నిష్క్రమిస్తాడు)
యిదేమిబ్రహ్మన్న మంత్రీ ?

[బ్రహ్మనాయుడు అప్పటి కప్పుడే దీర్ఘాలోచనలో పడతాడు]

కన్నమదాసు :

మరొక పన్నాగం ప్రభూ !

కొమ్మరాజు :

ఏదైనా సరే, నరసింగరాజు తల వూడక తప్పదు.

కన్నమనీడు :

యుద్ధం ఆపటానికి వీల్లేదు.

[రాయబారి ప్రవేశం]

రాయబారి :

జయం, జయం! మలిదేవ ప్రభువులకు, జయం, జయం! బ్రహ్మన్న మంత్రికి.

బ్రహ్మనాయడు :

ఎవరి పంపున వచ్చారు ?

రాయబారి :

నాయకురాలు పంపగా వచ్చాను.

బ్రహ్మనాయడు :

విశేషాలేమి ?

రాయబారి :

రాయబారం తెచ్చాను.

కొమ్మరాజు :

ఏమని ?

రాయబారి :

మీ మాచెర్ల భాగం మీకిస్తానన్నది.

కొమ్మరాజు :

మరి నరసింగరాజు తలో ? !

రాయబారి :

ఆ సంగతికూడా మేము నాయకురాలితో ప్రస్తావించాము. అలరాజును హత్య చేయటం అపరాధమే నని

ఆమె అంగీకరించింది. అందుకు కారకుడైన నరసింగరాజును మీకు వప్పగిస్తాను. మీరే విచారించి తగిన శిక్ష విధించండి.

కొమ్మరాజు :

(తికమకపడి ఆలోచిస్తూ వుంటాడు)

రాయబారి :

బ్రహ్మన్నమంత్రీ ! తమ వుద్దేశం చెప్పరూ ? మీరీ షరతుల కంగీకరిస్తే, నలగామరాజు మీ శిబిరానికి వచ్చి, జరిగిన దానికి క్షమాపణ చెప్పుకుంటా నంటున్నాడు.

బ్రహ్మనాయుడు :

అంత పనా ? ఎంత జరిగినా, వారు మనందరికీ రాజే కదా !

రాయబారి :

వారు జరిగిన దానికి చాలా పశ్చాత్తాప పడు తున్నారు. పల్నాటి రక్తం యీ అంతఃకలహాలకు ధార పోయటానికి ఆయన మనస్సు అంగీకరించటం లేదు ... ఏమి శెలవు బ్రహ్మన్న మంత్రీ ? ... ...

బ్రహ్మనాయుడు :

ప్రభువుల వుద్దేశం కదా ముఖ్యం ...

మలిదేవభూపతి :

ఇదే నిజమైతే, అందరికీ అంగీకారమే.

బ్రహ్మనాయుడు:

సేనాపతీ ! నీ వుద్దేశం ఏమిటి ?

కన్నమనీడు :

మీ భక్తుణ్ణి. కాని యిదేదో గారడీగా వుంది బ్రహ్మన్న మంత్రీ! సంధికోసం మనం చేసిన ప్రతి పనినీ మనం పంపిన ప్రతి మాటనీ తృణీకరించిన నాయకురాలు తానంత తానే యీ రాయబారం పంపిందంటే నమ్మ శక్యంకాకుండా వుంది. ఇంతకు ముందు మనం పంపిన భట్టుని అపహాస్యం చేసింది. ఇప్పుడు మనం అడిగిన షరతులన్నిటినీ అంగీకరిస్తూ రాయబారం పంపింది. విష్ణు మూర్తి బ్రహ్మనాయుడా! ఇందులో యేదో పన్నాగం వుండితీరాలి.

రాయబారి :

పన్నాగమేమిటి, కన్నమదాసూ? మీ రంగీకరిస్తే నేను వెళ్ళి వారికి తెలియజేస్తాను. యదార్థం తరువాతైనా మీకు తెలుస్తుందిగా! ఇంతలో మీకువచ్చే నష్టం మాత్రం యేముంది? మీ రొక సంగతి ఆలోచించండి, మలిదేవ భూపతీ! ఇరువాగుల్లో వారూ బంధువులే. నాయకురాలి మాట యెట్లావున్నా, మిగిలిన వీరులకు యీ బంధునష్టం యిష్టంలేదు. వార్రి మనస్సులు కనిపెట్టి నాయకురాలే నన్ను పంపింది. మీరడిగిన వన్నీ శాంతికోసం అంగీకరించింది. పల నాటి శ్రేయస్సుగోసం యీ అవకాశం జారవిడువకండి.

కన్నమదాసు :

నరసింగరా జంతపౌరుషవంతుడే! అతని పౌరుషం

ముందు బంధువులు, పలనాడు, కనుపించనే కనుపించరే...
అత నెట్లా అంగీకరించాడు యీ రాయబారానికి ?

రాయబారి :

ఒకప్రక్కన నలగామరాజు, మరొక ప్రక్క నాయకు రాలు సంధికావాలని కోరితే ఆయ నెట్లా ఆపగలడు ? పైగా తనంత తానే సంధికి సేను అడ్డు నిలవ నన్నాడు. శాంతికోసం ప్రాణాలను అర్పించవలసి వచ్చినా వెనుదీయ నన్నాడు. ఆ ధైర్యంతోనే నరసింగరాజును తమ దగ్గరకు పంపగల మని మాట యిచ్చాము. మా మాట నమ్మండి.

బ్రహ్మనాయడు :

దీని కింత తరచట మెందుకు ? వారు సహృదయంతో యే విధంగా సంధి చేసుకోవాలనుకున్నా మే మందుకు సిద్ధంగా వున్నాం. అనుగురాజుగారు వారి బిడ్డల నందరినీ నా కప్పగించి వెళ్ళారు. వారు అన్యోన్యంగా వుండటంకంటే నా కేం కావాలి ? వా రా విధంగా వుంటే నా జన్మ ధన్య మయినట్లే భావిస్తాను. నలగామరాజుకీ, నాయకురాలికీ, ప్రభువు తరఫున యీ కబు రందజెయ్యండి. ఇంత మంచి వార్తను తెచ్చిన మీరు యీ పూట మా ఆతిథ్యాన్ని స్వీకరించి వెళ్ళుదురుగాని.

[బైట కలకలం. అంతా అటు చూస్తారు.
సేవకుడు హడావిడిగా ప్రవేశం]

సేవకుడు :

బాలచంద్రుడు ప్రభూ, బాలచంద్రుడు.

బ్రహ్మనాయుడు :

ఆహా ! కాలవైపరీత్యం ! (బాలచంద్రుడు తన మిత్ర బృందంతో ప్రవేశిస్తాడు. సభికులలో గుసగుసలు. 'బాల చంద్రుడు'...'బాలచంద్రుడు'... ...'పలనాటి సింహము' 'పలనాటిసింహం'... బాలచంద్రుని చూసి కన్నమదాసు యెదురుగా వెళ్తాడు.)

కన్నమదాసు :

సమయానికి వచ్చావు బాలచంద్రా !

బాదన్న :

సంధి కుదిరింది:

బాలచంద్రుడు :

సంధా ! (ఆశ్చర్య చకితు డౌతాడు)

బాదన్న :

ఔను బాలచంద్రా ! మన మాచెర్ల భాగం మన కిస్తామన్నారు.

కొమ్మరాజు :

నరసింగరాజు తలకూడా యిస్తామన్నారు.

బాలచంద్రుడు :

నిజమేనా బ్రహ్మన్న మంత్రీ ?

బ్రహ్మనాయుడు :

అవునయ్యా ! మనం కోరిన షరతులు వా రంగీక

రించారు. ప్రభువులు సంధి కుదుర్చుకున్నారు. ఇందులో జరుగకూడని దేమున్నది ?

బాలచంద్రుడు :

మరి చాపకూడు సిద్ధాంత మేమైనది ?

బాదన్న :

దానికీ దీనికీ యేమిసంబంధం బాలచంద్రా !

బాలచంద్రుడు :

సంబంధం లేకపోవట మేమిటి? అసలు నాయకురాలికీ మనకూ కథా కారణమే యీ సిద్ధాంతం. ఆమె వర్ణాశ్రమ ధర్మ రక్షణ మనే నెపంతో సంఘంలో వున్న హెచ్చు తగ్గుల్ని కాపాడుతూవుంది. బ్రహ్మన్న మంత్రి మానవు లందరూ ఒకటే, సమానత్వం కావాలంటున్నాడు. దీనికి మలిదేవ భూపతులు అంగీకరించారు. ఈ సిద్ధాంతంమీద మనకున్న మమకారంవల్లే మనకు బ్రహ్మనాయునిమీద, మలిదేవ భూపతులమీద మక్కువ కలిగింది. వారికోసం ప్రాణాలను త్యజించడానికైనా సిద్ధపడటానికి కారణం యిదే. అంతేగాని మలిదేవ భూపతికీ బ్రహ్మన్న మంత్రికీ మాచర్ల భూభాగాన్ని కట్టిపెట్టటానికి కాదు మనం యిక్కడకు వచ్చింది. వారికి రాజ్యం వస్తే మనకు ఒరిగే దేమిటి ? పోతే మనకు పోయే దేమిటి ? మనకు కావలసింది, బ్రహ్మనాయుని చాపకూడు సిద్ధాంతం. మన మీ యుద్ధంలో జయిస్తే ఒక్క పలనాడే కాక, పలనాడులో వున్న కులాలన్నీ యేకమవుతా యనీ, పలనాటివాసుల్లో నీచజాతు లనేవి పోయి, పల్నాడు

సర్వాంగ శోభితంగా వృద్ధిచెందుతుందనీ ఆశించాము. ఈ సంధివల్ల యీ మన ఆశ యెంతవరకు నెరవేరిందని నేను ప్రశ్నిస్తున్నాను. (సభికుల్లో కలకలం. కన్నమదాసు తబ్బిబ్బు పడుతూంటాడు. మలిదేవభూపతి బ్రహ్మనాయని పరికిస్తాడు. బ్రహ్మనాయని ముఖంమీద నిరాశారేఖలు తాండవిస్తుంటవి. కన్నమదాసు ముఠాలో ముఖ్యుడైన వీరదాసు లేస్తాడు)

వీరదాసు :

ప్రభువులకు మేం చెప్పేటంతవాళ్ళం కాదుగాని, బాలుడు వేసిన ప్రశ్నకు జవాబు చెప్పవలసిన బాధ్యత ప్రభువులమీద వుంది. మా కులాలకు నాగమ్మ పేరుచెప్పితే శివమెక్కుతుంది. ఎందుకని ?... ఆమె అధికారం క్రింద గురిజాలలో మాకులాలు అనుభవించే యాతనవల్ల ... బ్రహ్మన్న మంత్రి పేరుచెప్పినా, మలిదేవరాజులపేరు చెప్పినా మా ఒళ్ళు పులకరిస్తుంది. ఎందుకని ?...... వారు మమ్మల్ని మానవమాత్రులుగా, తమతోటివారుగా చూస్తున్నారు గనుక. కాబట్టి మనకు స్పష్టంగా తెలిసినా తెలియకపోయినా యీపలనాటి ప్రజల యిష్టాయిష్టాలు చాపకూడు సిద్ధాంతాన్ని బట్టే ఏర్పడుతున్నాయి. మన జీవితాలు చాపకూడుసిద్ధాంతం చుట్టే తిరుగుతున్నాయి .........ప్రభువులు బాలచంద్రుని ప్రశ్నకు జవాబు దయచేయించాలి.

[సభికుల్లో గుసగుసలు బైలుదేరుతాయి.]

బ్రహ్మనాయడు :

వీరులారా! బాలుడుఅడిగినప్రశ్న మంచిదే; అడుగవలసిందే. మన వీరదాసు చెప్పిందీ నిజమే. అదెవ్వరూ

కాదనటం లేదు. చాపకూడు సిద్ధాంతం మన ఆయువుపట్టు. మన అందరికలయికకూ అదే మూలం. పలనాటి భవిష్యత్తుకు అదేదారి. అందులో సందేహంలేదు. కాని యీ సంధి దానికి ఏ విధంగా విరుద్ధం? ... మన మాచెర్లభాగం మనకువస్తే ఆభాగంలో కూడా మనసిద్ధాంతాన్ని ప్రచారానికి తేవాలని నా సంకల్పం. అంతేగాని, యీ సిద్ధాంతం కోసం పలనాటి ప్రజల రక్తాన్ని చిందించాలని నా కెప్పుడూ లేదు. మన మాచర్ల భాగం చాపకూడు సిద్ధాంతంవల్ల బాగుపడితే, ఆ బాగు గురిజాలకు వ్యాపిస్తుంది. మంచిపని తనకర్తవ్యం తానే నిర్వర్తించుకోగలదు. దాన్నెవ్వరూ అరికట్టలేరు. రోజులు కలిసివస్తే నలగామప్రభువే... నాయకురాలే... దీనిని గురిజాలలో ఆచరణలో పెట్టగలరేమో, ఎవరు చెప్పగలరు? మేము మాచర్ల భాగం కావాలనటం యీ వుద్దేశంతోనే. అంతేగాని బాలుడు చెప్పినట్లు మా స్వలాభం కోసం కాదు. ఈ సంధి జరగటం అందరికీ మంచిదే.

[సభికుల్లో గుసగుసలు]

బాలచంద్రుడు :

బ్రహ్మన్నమంత్రీ! నే నంగీకరించను. సంధి ప్రయత్నాన్ని నా శాయశక్తులా ఎదుర్కొంటాను. ఈ సంధివల్ల చాపకూడు సిద్ధాంతం వ్యాప్తంకాదని నా విశ్వాసం. అంతః కలహాలతో పలనాడు నాశనమవుతుందని నావిశ్వాసం. అసలు మీరడిగిన షరతులను నాయకురాలు అంగీకరించటం లోనే ఏదోమోసం వున్నదని నే ననుకుంటున్నాను. ఆమెలో

(11)

మొన్న లేని మార్పు, నిన్న లేనిమార్పు, ఎన్నడూ లేనిమార్పు యిప్పుడు ఎక్కడనుంచి వచ్చింది ?...ఎందుకు వచ్చింది?... మనలను ప్రమత్తులుగాచేసి, మనమీదకు అకస్మాత్ గా దాడి చేసి లోబరుచుకోవాలనే యీ యెత్తు యెత్తిందని నేను అనుకుంటున్నాను. ఒకవేళ మనకు నిజంగా మాచర్ల భాగం వచ్చినా ఒరిగే దేముంది?...నాయకురాలు యెప్పుడూ మన ప్రక్కలో బల్లెమే. ఈనాడు మనం పూర్తిగా యుద్ధసన్నాహాలు చేసుకుని వున్నాం. నాయకురాలు తన అహంకారం వల్ల తగు జాగ్రత్తలో లేదు. ఈనాడు అనేక కారణాలవల్ల పలనాటి ప్రజల అభిమానమంతా మనమీదే వుంది. ప్రభువులు ప్రజల కోర్కెలకు అనుకూలంగా వున్నారు. రేపు యెవరిదో ఎవరు చెప్పగలరు ?...పరిస్థితులు అనుకూలంగా వున్నప్పుడే మనం కార్యం చక్కబెట్టుకోవటం మంచిది. ఈ కార్యమపూడి కదనరంగంలోనే, ఇప్పుడే అన్నీ తేలాలి.

కన్నమనీడు :

ఇంతదూరం వచ్చి వెనక్కితిరగట మెందుకు బ్రహ్మనాయుడా ?...

బ్రహ్మనాయుడు :

అనవసరంగా పలనాటి ప్రజల రక్తాన్ని కాలువలు కట్టించమంటావా, కన్నమనీడూ ?... ...నే నంగీకరించను. యుద్ధం అంటే నాకు భయంలేదు. ఆ సంగతి మీ అందరికీ తెలుసు. కాని యుద్ధం నాకొక వ్యసనమూ కాదు. మిగిలిన [illegible] సహాయాలు నిరుపయోగమైన తరువాత యుద్ధం. వేరు

గత్యంతరం లేనప్పుడు మాత్రమే యుద్ధం. ఇప్పుడు మనం కొన్ని షరతులను కోరాము. గురిజాల ఆ షరతులన్నిటినీ అంగీకరించింది. ఇక యుద్ధానికి చోటెక్కడ?...నా నైపుణ్యం చూపటానికిగానీ, కీర్తిని కాంక్షించిగానీ, వీరస్వర్గమాశించి గానీ నేను యుద్ధానికి దిగను. నా కోసం పలనాటి వీరులను' ఆహుతి చెయ్యను. మీరు కోరే చాపకూడు సిద్ధాంతానికి కూడా సంధి మార్గమే శ్రేయస్కరమని నా నమ్మకం... బాలచంద్రా! పలనాటి శ్రేయస్సుకోరి, ఈ ప్రజల శ్రేయస్సు కోరి యికనైనా నీ ప్రయత్నం విరమించు. (బాలచంద్రుడు ఆవేశంతో యేదో మాట్లాడబోతాడు. కన్నమదాసు అడ్డు తగుల్తాడు.)

కన్నమదాసు :

బాలచంద్రా! బ్రహ్మన్న మంత్రి మాటవిను. నీవలె నేనూ మొదట్లో యీ సంధికి ఎదురు తిరిగాను. ఈ సంధి కృత్రిమం అన్నాను. ఇది నాయకురాలి పన్నాగం అన్నాను. కాని బ్రహ్మన్న మంత్రి చెప్పిన మాటలు విన్న తర్వాత, నే నే పొరపాటు పడ్డానని గ్రహించాను. ఈ రాయ బారం పన్నాగమేనని శంకించి పలనాటిని అగ్నిగుండంలోకి త్రోయటం భావ్యంకాదని నేను అనుకుంటున్నాను. ఆలో చించు. బాలచంద్రా! ఒకవేళ యిది పన్నాగమే అయినా, నీవూ నేనూ వున్నంతకాలం పలనాటి భవిష్యత్తును గురించి భయపడటం దేనికి?... ... తమ్ముడా, చాపకూడు సిద్ధాంత మంటే నాకెంత మమకారమో నీకు తెలుసు. దానివల్ల

పూర్తిగా బాగుపడ్డవాళ్ళం మేము. అటువంటి మేముకూడా బ్రహ్మన్నమంత్రి సూచించినట్లు సంధే మంచిదనుకుంటున్నాం. నామాట విను.

బాలచంద్రుడు :

నా మనస్సు ఒప్పుకోవటం లేదు.

పేర్నీడు :

అన్నా ! ఆలోచించు.

బాలచంద్రుడు :

ఆలోచించేగదా యింటిదగ్గిరనుంచి బైలుదేరాము.

పేర్నీడు :

బ్రహ్మన్నతండ్రి మాట విను.

బాలచంద్రుడు :

నేచెప్పేది వారిమాటే. చాపకూడు సిద్ధాంతం కావాలనే.

వీరదాసు :

చాపకూడు సిద్ధాంతం వారు కాదనలేదుగా బాలచంద్రా! దాని ఆచరణకు వారు సూచించేమార్గం వేరు. వారు మనకంటే అనుభవం వున్నవారు. వారుచెప్పినట్లు వినటమే మనకుమంచిదేమో.

[ బాలచంద్రుడు ఆలోచిస్తుంటాడు ]

పేర్నీడు :

కుర్రవాళ్లు తొందరపడి పలనాటిని నాశనంచేశారనే అపవాదు ఎక్కడ మనమీదికి వస్తుందో అని నా భయం.

[ బాలచంద్రుడు ఆలోచిస్తుంటాడు. అందరి దృష్టులు ఆతనిమీద కేంద్రీకరింప బడివుంటాయి. అంతలో సేవకుడు ప్రవేశిస్తాడు.]

సేవకుడు :

వేగుల శరభన్న ప్రభువుల దర్శనార్థం వచ్చాడు.

మలిదేవ భూపతి :

ప్రవేశపెట్టు. (సేవకుడు నిష్క్రమణ) శరభన్న రావటమంటే !...

బ్రహ్మనాయుడు :

ఏదో పెద్దపనే వుండి వుండాలి ప్రభూ.

[ శరభన్న ప్రవేశం ]

శరభన్న :

దండాలు ప్రభూ దండాలు !...ప్రభువుల ఆజ్ఞప్రకారము మనమాడచిమారువేషంతో శత్రు శిబిరంలోకి వెళ్ళింది ప్రభూ. ఈ రాత్రికే మనల్ని ముట్టడించాలని వారు పన్నాగం పన్నుతున్నారట. (సభికుల్లో కలకలం. రాయబారి దొంగచాటుగా నిష్క్రమిస్తాడు.)

బాలచంద్రుడు :

ఇప్పటికైనా గ్రహించావా బ్రహ్మన్న మంత్రీ !

ఈ రాయబారం నాయకురాలి పన్నాగమే. ఈ రాయబార నెపంతో మనల్ని ప్రమత్తులను చేసి, అర్ధరాత్రివేళ దాడి చేసి మనల్ని సర్వనాశనం చెయ్యాలని నాయకురాలి సంకల్పం. (మలిదేవునితో) మనం పాముతో చెరలాట లాడుతున్నాం ప్రభూ. ఇప్పటికైనా నా మాట వినండి... రాయబారి యేడీ?... ఎక్కడ?

బాదన్న :

పారిపోయి నట్లున్నాడు.

వీరదాసు :

ఎంత మోసం !!

బాలచంద్రుడు :

కన్నమదాసూ ! యింకేమిటి ఆలోచిస్తున్నావు.

కన్నమనీడు :

బాలచంద్రా ! నీమాటే నిజమైంది. (కౌగిలించుకొని) అందరి అనుమానాలు తీరినవి. యిక నిస్సంకోచంగా పోరాడ గలం. మనం పోరాడేది మానవులతో కాదు, నరరూప రాక్షసులతో. నాయకురాలి నాశనం తప్పదు.

కొమ్మరాజు :

ఇక నరసింగరాజు తల నాదే.

కన్నమనీడు :

యుద్ధం. యుద్ధం...!

[సభికుల్లో కోలాహలం; యుద్ధ నినాదాలు.]

బ్రహ్మన్నాయుడు :

ఉరవడితో వచ్చే ప్రవాహాన్ని ఎక్కడికక్కడ అడ్డు కోటానికి ప్రయత్నించాను. నా ప్రయత్నంవల్ల వురవడి హెచ్చింది. అంతే......

కన్నమదాసు :

పలనాటి వీరులారా! మీ ధైర్యసాహసాలు ప్రక టించేతరుణమిదే. యిన్నాళ్లూ మిమ్మల్ని ఆపినందుకు క్షమిం చండి. యిక ఒక్కక్షణం ఆగేది లేదు. ముందుకు నడవండి. పలనాటి వీరునకు వెనుకచూపు లేదు.

[సభలో కలకలం....జై....మలిదేవభూపతికి జై....జై.
బ్రహ్మనాయనికి జై....చాపకుడు సిద్ధాంతానికి....జై.]

బాలచంద్రుడు :

బ్రహ్మన్న మంత్రీ! యుద్ధం తప్పలేదని విచార పడకు. ఈ యుద్ధాన్ని ఎవరూ తప్పించ లేరు. మీకు తొలి కానుకగా నరసింగరాజు తలను అర్పిస్తాను.

కొమ్మరాజు :

అది నా పని బాలచంద్రా!

బాలచంద్రుడు :

ముందు మీ చేతిలో వుంచి తర్వాత బ్రహ్మన్న మంత్రి పాదాల మీదికి దొర్లిస్తాను. పూల చెండులా దొర్లి స్తాను. లేవండి. కార్యమపూడి కదన రంగానికి కదలండి.

[సభికుల్లో కలకలం, వినాదాలు....జై. బాలచంద్రునికి జై....
చాపకూడు సిద్ధాంతానికి జై....అంటూ అందరూ లేచి బైలుదేర్తారు]

మలిదేవ భూపతి :

బ్రహ్మన్న మంత్రీ !

బ్రహ్మనాయడు :

ఇక యువకులదే పెత్తనం ప్రభూ. పలనాటిని రక్షించవలసిన భారం చెన్నకేశవులదే !

—[తెర]—

## రెండోరంగం:

[బ్రహ్మనాయని యిల్లు. ఐతాంబ యేదో ఆలో
చిస్తూ కూర్చుని వుంటుంది. మాడచి ప్రవేశం]

ఐతమ్మ :

ఏం మాడచీ?

మాడచి :

యుద్ధరంగంనుంచి యింతవరకు యివ్వాళ కబురు రాలేదమ్మా.

ఐతమ్మ :

బాలుడు వెళ్ళాడు. ఇక కబురు పంపటానికే తీరిక వుండనివ్వడు. ఏమనుకొని ఏమి ప్రయోజనం? బాలుణ్ణి ఆపలేకపోయాను. విధి ఒక ప్రక్కకే మొగ్గుతూ ఉంది. లేక పోతే నిన్నకాక మొన్న కళ్ళు తెరచిన మాంచాల యెంత సాహసం చేసింది!! ఎంత త్యాగం చేసింది! ఇంత వయస్సూ యింత అనుభవంకల నాబోటిదాన్నే తల వంచుకు నేట్టు చేసింది. ఆమె శక్తిని ఆమె మామగారు కూడా వూహించ లేకపోయారు. ధన్యవు మాంచాలా!!

మాడచి :

అమ్మా. మాంచాలమ్మగారు అంతటితో వూరుకో లేదు. నిన్నటినుంచి గ్రామాదులలో "ఆడవాళ్ళకు మాత్రం పలనాటిమాతను రక్షించవలసిన బాధ్యత లేదా? పలనాటి శౌర్యం మనరక్తనాళాల్లో మాత్రం ప్రవహించటంలేదా! మనంకూడా యుద్ధరంగం ప్రవేశించవలసిందే. అటు నాయకు

రాలు యుద్ధంచెయ్యటం లేదా?" అని యింటింటికీ తిరిగి చెపుతున్నారట. ఊరంతా అట్టుడికిపోయినట్లు పోతూ వుందమ్మా.

ఐతమ్మ :

మాంచాలకు పలనాటిమాత ఆవేశించినట్లుంది. లేక పోతే ముక్కుపచ్చలారని ఆపిల్ల ఎక్కడ? ఈపనులెక్కడ?!

మాడచి :

అదుగోనమ్మా! రేఖాంబగారూ, మాంచాలమ్మ గారూ యిటే వస్తున్నారు.

[ఐతమ్మ వారికి స్వాగతం చెప్పటానికి లేస్తుంది. రేఖాంబ, మాంచాల ప్రవేశిస్తారు. మాంచాల యుద్ధానికి అనుకూలమైన అలంకరణలో వుంటుంది. మాంచాల ఐతమ్మకు నమస్కరిస్తుంది. ]

ఐతమ్మ :

యిదేమి మాంచాలా? ఎక్కడికీ ప్రయాణం?

మాంచాల :

యుద్ధానికి అత్తా. నీ దీవనలుపొంది వెళ్దామని వచ్చాను.

రేఖాంబ :

చూశావా, ఐతమ్మా ఎంతవరదాకా వచ్చిందో! నీ అన్న అంత వృద్ధాప్యంలోనూ యుద్ధం యుద్ధం అంటూ వెళ్తుంటే వూరుకున్నా. ఈమె అల్లుణ్ణి యుద్ధానికిపంపుతుంటే ఏదో ఒకవిధంగా సరిపెట్టుకున్నా ...... యిప్పుడు తనే యుద్ధానికి బైలుదేరుతూవుంది. అల్లుడు యుద్ధానికి వెళ్ళేట

ప్పుడు 'పలనాటిలో స్త్రీలు యుద్ధానికివెళ్ళే ఆచారం లేదా అమ్మా' అని యీామెఅడిగితే, ఎందుకు అడుగుతూవుందో తెలుసుకోలేక 'ఎందుకులేదు' అన్నాను. యిప్పుడు ఆ మాటపట్టుకుని నేను యుద్ధానికి వెళ్తానని కూచుంటే నేనేమిచెప్పేది ఐతమ్మా.

ఐతమ్మ :

పలనాటిలోవున్న వీరులంతా రణభూమికి వెళ్లారు. యింకా సంధికే ప్రయత్నాలు జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నయ్. ఇంతలో నువ్వు సన్నద్ధం కావలసిన అవసరం ఏమి వచ్చిందమ్మా ?

మాంచాల :

అత్తయ్యా ! నిన్నటివరకూ నేనూ అలాగే అనుకున్నా. వారు యుద్ధానికి వెళ్ళటంతో నా బాధ్యత తీరింది అనుకున్నా. పలనాటికి విముక్తీ, సర్వసామ్య సిద్ధాంతానికి జయం తప్పదనుకున్నా. కాని పరిస్థితులు నేను వూహించినంత తేలిగ్గా వున్నట్లు కనపడటంలేదు అత్తయ్యా.

ఐతమ్మ :

యిప్పుడు కొత్తగా ఏం జరిగిందమ్మా ?

మాంచాల :

నాకు మొన్నంతా అపశకునాలే కనిపించినై. నిన్న వేకువజామున ఒక భయంకరమైన కల వచ్చింది అత్తయ్యా! పలనాటి మాతను అగ్నిజ్వాలలు చుట్టు ముడుతున్నయ్. పలనాటి మాతను రక్షించాలని నీ కుమారుడు ఆ జ్వాలల్లోకి దూకాడు. వెంటనే వారు జ్వాలల్లో చిక్కుకున్నారు.

బయటకు రాలేక "మాంచాలా, మాంచాలా" అని గొంతెత్తి పిలిచారు. (కన్నీరు తుడుచుకుని) అత్తయ్యా! వారిని యుద్ధానికి పంపింది నేను. వారికి యుద్ధంలో ఏం జరిగినా బాధ్యత నాదే. నేను వారిని విడిచి వుండలేను. అత్తయ్యా! నన్ను దీవించి పంపు...ఇప్పుడు తెలుస్తూ వుంది... వారిని చూసినట్లే లేదు.... (కన్నీరు)

ఐతమ్మ :

ఊరుకో అమ్మా. తప్పకుండా వెళ్ళు. నిన్ను భర్త దగ్గరకు వెళ్ళకుండా ఆపే కఠినులంకాము మేము. రేఖమ్మా! మన కాలం పూర్తి కావచ్చింది. పిల్లలకు మనం ఎందుకు ఎదురు చెప్పాలి? అదీకాక మాంచాల తన భర్త దగ్గరకు తాను వెళ్తావుంది. ఇందులో తప్పేముంది?

రేఖాంబ :

ఐతమ్మా, నీ యిష్టం. నీవు చెప్పింది కాదనే అలవాటు నాకెప్పుడుంది? (మాంచాల తల్లి కాళ్ళకూ, తరువాత అత్త కాళ్ళకూ మ్రొక్కుతుంది. యిద్దరూ దీవిస్తారు) అమ్మా క్షేమంగా వెళ్లిరా. మీ తండ్రిని జాగ్రత్తగా చూచుకో......నన్ను గురించి ఏం బెంగా పెట్టుకో వద్దను. విరోధులను జయించి తిరిగిరండి.

ఐతమ్మ :

అమ్మా......మాంచాలా......బాలుడు వుద్రేకి, జాగ్రత్త. మీ మామగారితో నా ప్రయత్నంలో లోటు లేదని చెప్పమ్మా...

—[ తెర ]—

# అయిదో అంకం

## మొదటి రంగం:

[ కార్యమపూడి కదనరంగం, కన్నమదాసు నాయకత్వం క్రింద మలిదేవభూపతి సేనలు; నాయకురాలి నాయకత్వం క్రింద నలగామ రాజు సేనలు యుద్ధానికి ఢీకొంటాయి. రణదుందుభుల మ్రోతలతో సేనల కేకలతో, భయంకరధ్వనులతో. యుద్ధరంగం అతి భయానకంగా వుంటుంది. ఆరోజు బ్రహ్మనాయడు యుద్ధంలో పాల్గొన్నారు. తనశిబిరంలోనే వుండి యుద్ధవార్తలను సేకరిస్తూ, వాటికి తగిన వ్యూహాలను పన్నుతూ, యుద్ధాన్ని నడుపుతూ వుంటాడు. ఒక స్త్రీ, ఒక పురుషుడు యుద్ధభూమికి కొంచెం దూరంలో వుండి యుద్ధాన్ని తిలకిస్తూ వుంటారు.]

పురుషుడు :

చూశావా ! రెండు సైన్యాలు, రెండు పర్వతపంక్తులు ఢీకొంటున్నట్టు ఢీకొంటున్నాయి. సైనికులు, సైన్యాధ్యక్షులను మించిన వీరావేశంతో పోరాడుతున్నారు.

స్త్రీ :

ఏమి వీరావేశం ! సైనికుల పాదఘట్టనకు రేగిన ధూళి కూడా జీవం పోసుకుని యుద్ధంలో పాల్గొంటూ వున్నట్టుంది. యిది భారతయుద్ధాన్ని మరిపిస్తూవుంది.

పురుషుడు :

సంఖ్యలో నాయకురాలి సైన్యమే పెద్దది.

స్త్రీ :

ఆవేశంలో బ్రహ్మనాయని సైన్యం.

పురుషుడు :

పెద్దపెద్ద నాయకులంతా నాయకురాలి పక్షమే.

స్త్రీ :

ఇటు ఒక్కొక్క సైనికుడు ఒక్కొక్క నాయకుడు. పలనాటి గండుశిలలే వీరుల రూపాన్ని ధరించి పోరాడుతూ వున్నట్లుంది. ఎవరావీరుడు ? ఏమి సమరోత్సాహం !

పురుషుడు :

అతడే బాలచంద్రుడు. పలనాటిమాత తన భవిష్యత్తును నిర్ణయించే అధికారం అతనికే అప్పగించింది. ఏదో అంటున్నాడు వీరుడు :

[ యుద్ధ రంగంలో ]

బాలచంద్రుడు :

సైనికులారా ! అనేక ఏండ్లనుంచి యీపలనాటి గడ్డ కోసం మీరు కన్న కలలు నిజమయ్యే తరుణం నేటి కాసన్నమైంది. ఈ పలనాటిగడ్డ రాజాధిరాజులదీ, అగ్రజాతులవారిదీ మాత్రమే కాదు. ఈ గడ్డమీద పుట్టిపెరిగిన ప్రతిమనిషిదీని. ఈ గడ్డను విభజించే హక్కుగానీ, తమకై వశంచేసుకునే అధికారంగానీ, ఎవరికీలేదు. వర్ణాశ్రమ ధర్మాల నెపంతో గానీ, స్వధర్మనిర్వహణ నెపంతోగానీ మామూలు ప్రజల మీద పెత్తనం చెలాయించే హక్కు ఎవరికీలేదు. మనుష్యులందరం ఒకటే. అందరం సమానులమే. ఈ గడ్డమీద పుట్టి పెరిగిన ప్రతిఒక్కడికీ ఇక్కడ బ్రతికేహక్కు వుంది. తల్లికి బిడ్డలందరూ సమానులే. రండి. మనం మరణించి

అయినా తల్లిని బ్రతికించ వలసినబాధ్యత మనందరిమీదా వుంది. (సైనికుల కోలాహలం 'బాలచంద్రునికి...జై... పల్నాటి మాతకు...జై... సమానత్వం వర్ధిల్లాలి' అనే కేకలు మిన్ను మన్ను ముట్టుతవి.)

స్త్రీ :

ఆహా! ఏమి పరాక్రమం. నాయకురాలి సైన్యాన్ని ఊచకోత కోస్తున్నాడు. చెదరిపోతున్న మేఘాలవలె నాయకురాలి సైన్యం రెపరెపలాడి పోతూవుంది. ఎవరా ఏనుగు మీద? చెదిరిపోతున్న సైన్యాన్ని వుత్సాహపరుస్తున్నాడు!

పురుషుడు :

అతడే నరసింగరాజు. నలగామరాజు సోదరుడు. బాలచంద్రునికి తగిన ఉజ్జీ... విను.

[యుద్ధరంగంలో]

నరసింగరాజు :

సైనికులారా! ముందుకు నడవండి. వర్ణసంకరం చేసి పలనాటిని కల్లోల పరుస్తున్న బ్రహ్మనాయణ్ణీ అతని సైన్యాలను ఓడించి సత్సంప్రదాయాలను నిలబెట్టవలసిన భాధ్యత మీ భుజాస్కంధాలమీద వుంది. తరతరాలనుంచి మా కుటుంబంమీద మీకు వృద్ధి పొందుతూ వచ్చిన విశ్వాసాన్ని నిరూపించుకోవలసిన తరుణమిది. నలగామరాజు మీ కోసం, మీ హక్కులకోసం, వర్ణాశ్రమ ధర్మాలను నిలబెట్టటం కోసం యుద్ధానికి దిగాడని మీరు మరచిపోకండి. మన బాహుబలం ముందు శత్రువు ఎంత? శత్రు సైన్యం

యుద్ధం చేతగాని మూక. బ్రహ్మనాయుడు నానా జాతుల నుంచి చేతికి అందిన వాళ్ళను అందినట్టు ప్రోగుచేసిన గాలి మూక. రండీ!(సైనికుల నినాదాలు 'నరసింగరాజుకు జై... జై... వర్ణాశ్రమ ధర్మాలు వర్ధిల్లాలి')

పురుషుడు :

అదుగో నరసింగరాజు. బాలచంద్రుని మీదికి వురికాడు.

స్త్రీ :

బాలచంద్రుడెంత నైపుణ్యంగా తప్పించుకున్నాడు! ఏమి నైపుణ్యం! ఏమి పరవశత్వం!!

[యుద్ధ రంగంలో]

బాలచంద్రుడు :

నరసింగా! నేటికి గదా, నువ్వు నాకు దొరికావు. అలరాజును హత్య చేయించి, మలిదేవ భూపతులకు ద్రోహం చేసి, పలనాటిని ఛిన్నాభిన్నం చేసి, తల్లి హృదయంలో చిచ్చు పెట్టిన నీచుడవు నీవు. రా. నేటితో యీ గడ్డకు నీ శని విరగడౌతుంది. నా శపథం నెరవేరుతుంది.

నరసింగరాజు :

బాలచంద్రా! వాచాలుడవు. నీ నోటివెంట రావలసినమాటలే వచ్చినయ్. మంత్రిగా వుండటంతో తృప్తి పడక, మలిదేవులను పలనాటిసీమకు అధిపతులుగా జేసి, వారి పేరు మీదుగా తానే రాజ్యంపరిపాలించాలనే కోర్కెతో, యీ విధ్వంసానికి కారకుడైన బ్రహ్మనాయని కొడుకువు గాదూ నువ్వు? రా. ఎవరికోసం బ్రహ్మనాయుడు పలనాటి

సీమను హస్తగతం చేసుకోవాలనుకున్నాడో, అటువంటి నిన్ను ముందుగా రూపుమాపి అతని ఆశలను కూకటి వ్రేళ్ళతో నాశనం చేస్తాను. (సైనికుల కోలాహలం మిన్ను ముట్టుతుంది. ఇరుపక్షాల నినాదాలు విజృంభిస్తాయి. రణ దుందుభులు మ్రోగుతాయి.)

స్త్రీ :

ఆహా! ఏమి యుద్ధం! సరిసమానంగా పోరాడుతున్నారు. ఈ యుద్ధం కృష్ణార్జునుల ద్వంద్వయుద్ధాన్ని మరిపిస్తూవుంది. ఈటెకు ఈటె! పోటుకు పోటు!! వ్రేటుకు వ్రేటు!!! ఆహా! ఏమి చాతుర్యం!!

[యుద్ధరంగంలో]

బాలచంద్రుడు :

నరసింగా! నీ పాపం పండింది. యిదుగో! యీదెబ్బ కాచుకో! (ఈటె విసరగా సైనికుల కోలాహలం. హాహాకారాలు)

నరసింగరాజు :

(దెబ్బ తప్పుకుని నవ్వి) ఇదేనా బాలచంద్రా! నీ ప్రతాపం? మంత్రిత్వం చేసుకోవలసిన వాడివి దురాశకొద్దీ యుద్ధానికి దిగావు. స్వధర్మ నిర్వహణ మానుకుని యితరుల హక్కులకోసం ప్రాకులాడే నీబోటివాళ్ళ దుర్గతి యింతే. కాచుకో! ఛాచాలుడా......

[ఖడ్గం విసురుతాడు. సైనికుల హాహాకారాలు]

స్త్రీ :

అదుగో బాలుడు దెబ్బ త ప్పించుకున్నాడు. దండ తాడిత భుజంగంలా లేస్తున్నాడు... బాలుడు అభిమన్యుడి అవతారమే, సందేహంలేదు. అదిగో నరసింగరాజు ఏనుగ యొక్క కుంభ స్థలంమీదికి బాలుడు ధూకాడు. ఒక్క దెబ్బతో ఏనుగు కూలిపోతూవుంది (ఏనుగుల ఘీంకారం. సైనికుల హాహాకారాలు. బాలచంద్రునికి జై ... అని కేకలు)

స్త్రీ :

అయ్యో ? బాలుని ధాటికాగలేక నాయకురాలి సైన్యాలు పరారవుతున్నాయి. అయ్యయ్యో ! నరసింగ రాజుకూడా !

పురుషుడు :

కాదు కాదు. పారిపోతున్న సైన్యాలను మరలించ టానికి ప్రయత్నిస్తునాడు.

స్త్రీ :

ఏమిటో అంటున్నాడు :

[ యుద్ధరంగంలో ]

నరసింగరాజు :

సైనికులారా! ఆగండి ఆగండి. ఇదేమి అన్యాయం?

తిరిగిపోవుట యిట్లు ధీర ధర్మంబె ?
బాలుర గనుగొని పరుగిడ నేల ?
మిమ్ముగాంచిన వారి మేలుత్యజించి

నమ్మిన రాజును నట్టేటముంచి
పోవుట నీతియే పుణ్యాత్ములార !
ధైర్య హీనత వీర ధర్మంబుమాని
భంగురం బై మలభాండమైనట్టి
దేహంబు కొరకు సత్కీర్తి పోరాడి
విరిగిపోయెడు నట్టి వెర్రులు గలరె ?
వచ్చిన కార్యంబు వరదలో గలిపి
బంధుమిత్రులు పగవారును నవ్వ
పోవుట నీచమ్ము; పుట్టి దన్నంబు
పోవద్దు; రాజాన పోయితిరేని........

[కోలాహలం]

స్త్రీ :

అదుగో నరసింగరాజు మాటలకు కాకపడి కొండకు ఢీకొని వెను దిరిగిన సముద్రానికి మల్లే నాయకురాలి సైన్యాలు తిరిగి ముగ్గరం చొచ్చినై.

పురుషుడు :

అదుగో బాలచంద్రుడు. వెనుదిరిగిన నరసింగరాజును కాపాడటానికి అతన్ని చుట్టుకొంటూవున్న సైన్యంలోకి, సముద్రంలోకి చొచ్చుకొనిపోయే మొసలికి మల్లే చొచ్చుకు పోతున్నాడు. కన్నుమూసి తెరిచేటప్పటికి నరసింగరాజు దగ్గరకు చేరాడు.

[యుద్ధ రంగంలో]

బాలచంద్రుడు :

ఆగు! నరసింగా! ఆగు. రణభూమిని వీడి పలనాటికి అపఖ్యాతి తేకు. నలగామరాజు నీమీద ఆశ పెట్టుకుని యీ యుద్ధంలోకి దిగాడు. నాయకురాలు నీ భుజ దర్పంతోనే క్రొవ్వి కారులు కుయ్యటానికి సాహసించింది. వారి ఆశలు అడియాసలు చెయ్యకు.

నరసింగరాజు :

నీచుడా! అనుగురాజు వంశానికి చెందిన నాకే నీతులు వుపదేశిస్తున్నావుగా. పలనాటి మాతకు గండాన పుట్టిన మాతృ హంతకుడవు నీవు. తండ్రికి కొరగాని కొడుకువు. రా. యిదుగో, యీదెబ్బ కాచుకో! (కోలాహలం హాహా కారాలు, జయజయధ్వానాలు.)

స్త్రీ :

అయ్యో! నరసింగరాజు విసిరిన బల్లెం బాలుని డొక్కలోకి దిగింది!

పురుషుడు :

ధన్యుడవు బాలచంద్రా! చూశావా! బాలుని వీరావేశం. డొక్కలోకి దిగిన బల్లాన్ని తానే పెకల్చుకొని రక్తం ప్రవహించకుండా తానే చేత్తో ఆపుకుంటూ ఎట్లా తెగబడ్డాడో—ప్రళయకాల రుద్రుడే అతడు. అభిమన్యుని యుద్ధమే యిది. అహో! అదుగో నరసింగరాజు మీదికి దూకాడు.

బాలచంద్రుడు :

ఇదుగో... ...నరసింగా! నీతోపాటు నలగామరాజు ఆశలన్నీ అడుగంటుగాక. నీతోపాటు నాయకురాలి వాంఛలన్నీ నిర్మూలమవుగాక. నీతోపాటు పలనాటిలో అసూయా ద్వేషాలూ, హెచ్చుతగ్గులు, కులతత్వాలు నశించుగాక!

[సైనికుల కోలాహలం, హాహాకారాలు హెచ్చుతై:
రెండోప్రక్క జయ జయ ధ్వానాలు రేగుతై....]

స్త్రీ :

అయ్యో, అయ్యో, నరసింగరాజు మొదలు విరిగిన వృక్షంలా కూలిపోయాడు. బాలచంద్రుడు ఆకొన్న సింహంలా అతనిమీదికి దూకాడు. అయ్యో, అయ్యో (చూడలేక తన చేతులతో కళ్ళను కప్పుకుంటుంది.)

పురుషుడు :

ఆహా! బాలుడు అతని మొండాన్నుంచి తలను వేరు చేశాడు.

స్త్రీ :

అయ్యో, అయ్యో! ఆ తలను అరచేతిలో పెట్టుకుని యెక్కడికి వెళ్తున్నాడు?

పురుషుడు :

తన తండ్రి దగ్గరకు. తన తండ్రితో నరసింగరాజును వధించి అతని తలను పాదాలమీద పెడతానని బాలుడు

శపథం చేశాడు. ఆ శపథం పూర్తిచేసుకోటానికి వెళ్తున్నాడు. పాపం నలగాముని సైన్యాలు నరసింగుని మరణంతో నీరసపడిపోయినై. నడుములు విరిగిన సర్పానికి మల్లే నడుస్తున్నాయి. (యుద్ధరంగంలో కలకలం)

స్త్రీ :

ఏమిటాకలకలం? ఎవ్వరా శ్వేతాశ్వంమీద? మేఘాల మీద స్వారి చేస్తున్న సూర్యబింబంలా ప్రకాశించే ఆ వ్యక్తి యెవ్వరు? నిరుత్సాహపడిన నలగామరాజు సైన్యాలు ఆమె దర్శన మాత్రంగా చెలరేగుతున్నాయ్ (కోలాహలం)

పురుషుడు :

నాయకురాలుగా ప్రసిద్ధికెక్కిన నాగమ ఆమె. బ్రహ్మనాయనికి ప్రతి ఉజ్జీ. నలగామరాజు బహిఃప్రాణం.

స్త్రీ :

ఏమిటో అంటోంది ... ...

[ యుద్ధరంగంలో ]

నాయకురాలు :

సైనికులారా! ఇంకెందుకు మీరు సంశయించేది? దేనికోసం? వీర నాయకులారా! మీ శౌర్య సాహసాలు నేడేమైనవి? మిమ్ములను తన బిడ్డలుగా చూసుకుంటున్న నరసింగ భూపాలుని మీరు రక్షించుకోలేక పోయారు. నరసింగ భూపాలుడు మరణించిం తర్వాత మన ప్రాణాలు

ఉండేం; ఊళ్లేం? నడవండి. వెనక్కు తిరక్కండి. విజయమో, వీరస్వర్గమో... అంతే.

[నాయకురాలికీ జై..నలగామరాజుకీ జై..వర్ణాశ్రమధర్మాలు వర్థిల్లాలి. అని కేకలు, సైనికుల కోలాహలం, రణదుందుభుల మోతలకు దిక్కులు పిక్కటిల్లుతై।]

స్త్రీ :

ఆహా! ఏమిశౌర్యం! ఆమె ఆదిశక్తి ప్రతిరూపమే. ఆమెముందు శత్రుసైనికులు, గాలికి పండిన ఆకులు రాలినట్లు రాలిపోతున్నారు. ఆమెను ఎదుర్కొని బ్రతుకుతున్న వీరుడు లేడు. అహో! బ్రహ్మనాయని సైన్యం ఆమెధాటికి ఆగలేక వెనుకంజ వేస్తూవుంది. ఏమి ఆ ప్రళయ తాండవం!

పురుషుడు :

అదుగో, కన్నమదాసు. చీకాకుపడుతున్న సైన్యాన్ని ప్రోత్సాహపరుస్తున్నాడు.

[యుద్ధరంగంలో]

కన్నమదాసు :

సైనికులారా! నడవండి. చేతులు చేతులు కలిపి నడవండి. ముందుకు ముందుకు నడవండి ఎవ్వరివల్ల అనుగురాజు సంతతిలో అంతఃకలహాలు పుట్టినవో, ఎవ్వరివల్ల యీ పలనాడు తనబిడ్డల రక్తంతో తడిసి యుద్ధ అవుతూవుందో, ఎవ్వరివల్ల మనం నమ్మిన చాపకూడుసిద్ధాంతం వమ్ము కాబడుతూ వుందో, ఆ స్త్రీరూపరాక్షసే యిప్పుడు మనముందు నిలబడింది. నడవండి. యీ యుద్ధాన్ని పూర్తి చెయ్యటానికి

యింతకంటే సదవకాశం మనకు దొరకదు. ( సైనికుల్లో కోలాహలం )

స్త్రీ :

అటుచూడు. ఆ ప్రక్క ఏమిటా జనసందోహం? ఎవ్వరా స్త్రీ?...అహా!...ఏమి మూర్తి!!

పురుషుడు :

ఆమె మాంచాల బాలచంద్రుని భార్య. యుద్ధాన్ని విడిచి, యుద్ధంలో భర్తనువిడిచియుండలేక యుద్ధానికి తాను కూడా బయలుదేరింది. ఆమెను చూసి బ్రహ్మనాయని సైన్యాలు ఏవిధంగా రెచ్చిపోతున్నవో చూశావా?

స్త్రీ :

బాలచంద్రుడు లేని లోటు తీర్చింది. సరాసరి నాయకురాలిమీదికే వెళ్తూవుంది. నాయకురాలితో ఏమిటో అంటూ ఉంది.

[యుద్ధరంగంలో]

మాంచాల :

ఎక్కడికి నాగమ్మా! ఆగు. విధ్వంసినీ! నీకు రోజులు దగ్గరకు వచ్చాయ్. నీవు పలనాటికి చేసినద్రోహం, నిన్ను నమ్మిన అమాయకుడైన నలగామరాజుకు చేస్తున్నద్రోహం, బ్రహ్మవేత్త అయిన బ్రహ్మనాయనికీ, మలిదేవ భూపతులకూ నువ్వుచేసిన అపచారం, పేదమ్మ కడుపులో చిచ్చుపెట్టిన పాపకృత్యం నిన్ను వెన్నంటుతున్నయ్. నువ్వు

ఎక్కడికి వెళ్ళినా వాటినుంచి తప్పించుకోలేవు నాగమ్మా! స్త్రీత్వానికే ద్రోహం చేస్తున్న ఘోరరాక్షసివి నీవు...

నాయకురాలు :

(తేరిపారచూసి) ఎవ్వరవు నువ్వు?

మాంచాల :

నన్ను గుర్తుపట్టలేవా నాగమ్మా?.........ఎవ్వరి హృదయంలో నీవు తీరని అగ్నిని రగిల్చావో... ఎవ్వరి రక్తాన్ని నువ్వు బొట్టుబొట్టుగా త్రాగుతున్నావో...ఎవ్వరి ముద్దుబిడ్డల్ని నువ్వు చిత్రవధ చేస్తున్నావో ఆ పలనాటి మాతను నేను......

శా. ఓ విశ్వపిని ! పలనాటి యశని వ్యూహంబ ! మోహప్రమ
త్తా ! వర్ణాశ్రమ ధర్మ రక్షణ ఛల స్వార్థ క్రియోన్మాది నీ !
చాపై వచ్చిన నన్నెరుంగవా ? ప్రజా సందోహ సంబుద్ధ భా
వావేశోజ్వల శక్తి నం చెరుగు నీ యంతబు నేడే యగున్.

నాయకురాలు :

గణాచారివలె ప్రేలుతున్నావు. నువ్వు ఎవ్వరవైనా నాకు ఒక్కటే. నా వ్యాపకానికి అడ్డుతగిలిన దానవు. రా. (రణదుందుభుల మ్రోతలు. సైనికుల కోలాహాల నినాదాలు)

స్త్రీ :

ఆహా! ఏమి నైపుణ్యం! కత్తుల మిలమిలలే తప్ప మరేమీ కన్పించటం లేదు.

పురుషుడు:

ఉరుము, మెరుపులే యుద్ధం చేస్తున్నట్లుంది. అంతా

ఒకటే వెలుగు. కండ్లు మిరుమిట్లు గొలుపుతున్నాయి. అంతా ఒకటేధ్వని. చెవులు దిబ్బెటలు వేస్తున్నాయి.

స్త్రీ :

నాగమ్మ మాంచాలను కారుమేఘంలా చుట్టుకుంటూ వుంది. మాంచాల నాగమ్మను మెరుపుతీగెలా స్పృశిస్తూ వుంది. ఆహా! ఏమి యీ పలనాటి స్త్రీలపౌరుషం! అయ్యో! నాగమ్మ అశ్వం బెదిరిపోయింది. (సైనికుల కోలాహలం. గజతురగాల ఘీంకృతులు, హేషలు) నాగమ్మ సైనికులను చిందర వందరగా త్రొక్కుకుంటూ ఎక్కడికో తోసుకుపోతూ వుంది. పాపం! మాంచాల హృదయం నిస్పృహతో నిండిపోయింది. (దూరంగా సైనికుల కోలాహలం.)

పురుషుడు :

బాలచంద్రుడు నరసింగరాజు తల బ్రహ్మనాయనికి అర్పణచేసి మళ్ళీ యుద్ధరంగం ప్రవేశిస్తూ వున్నాడు. అతని వాలకంచూస్తే బ్రహ్మనాయుడు అతను చేసిన పనిని అభినందించినట్లు లేదు.

[యుద్ధ రంగంలో]

బాలచంద్రుడు :

వీరులారా! యివ్వాళతో యీ యుద్ధం పూర్తికావలసిందే! నాయకురాలు, నలగామరాజు ఎవ్వరూ యివ్వాళిటికి మించి ఒక్క రోజుకూడా బ్రతకటానికి వీల్లేదు. ఈ ప్రయత్నంలో సర్వనాశనం అయినా సరే. పలనాడు

దగ్ధపటలం అయినాసరే. అప్పుడే యీ కార్యమపూడి కదన రంగం మీద కాకులూ, గ్రద్దలూ స్వైరవిహారం చేస్తున్నాయి చూశారా! కాలం గడిచిపోతూ వుంది. రండి. (సైనికుల కోలాహలం)

స్త్రీ :

చూశావా, బాలచంద్రుని కంఠధ్వనికి, మేఘగర్జనకు పురివిప్పుకుని నాట్యంచేసే నెమలికిమల్లె తయారైంది మాంచాల!! విప్ఫారిన ముఖపద్మముతో, చిటికతరంగాలతో, శోభిల్లే నిండు సరస్సుకిమల్లే శోభిల్లుతూ వుంది.

పురుషుడు :

అదుగో నాయకురాలు. సైన్యాన్ని బాలచంద్రుని మీదికి రెచ్చగొడుతూవుంది. సైన్యం సైన్యం యావత్తు ఒక్కుమ్మడిగా అతనిమీద పడటానికి ప్రయత్నిస్తూవుంది.

స్త్రీ :

అదుగో మాంచాల... బాలుని దీనావస్థను కనిపెట్టి విరోధిసైన్యాలను మేఘాలను చొచ్చుకపోయే విద్యుల్లత లాగా చొచ్చుకుపోయింది. తృటికాలంలో తనభర్త అండను చేరింది. బాలుడు గుర్తుపట్టాడు.

[యుద్ధరంగంలో]

[ఇద్దరూ యుద్ధంచేస్తూనే మాట్లాడుతుంటారు.]

బాలచంద్రుడు :

మాంచాలా!

మాంచాల :

స్వామీ !

బాలచంద్రుడు :

వచ్చావా, మాంచాలా ! ఉదయంనుంచి ఎందుకనో నీమాటే జ్ఞాపకం వస్తూవుంది. విడవకుండా నీరూపే కనిపిస్తూ వుంది. ఎంత మంచిపనిచేశావు మాంచాలా ! ఇదుగో యివ్వాళతో నీ మనోభీష్టం నెరవేరుస్తాను. యిక నాకు ఏ కోర్కెలేదు. దేనికీ వెరపులేదు. (బాలుడు విజృంభిస్తాడు. అతనితోపాటు మాంచాల విజృంభిస్తుంది.)

స్త్రీ :

నాయకురాలి సైన్యాలు వలయాకారంగా చుట్టుముట్టి క్రమక్రమంగా ముంచుకొస్తున్నాయ్. ఆహా ! ఎంత భయంకరం ? ఎంత భీభత్సం! నేను చూడలేకుండా వున్నాను. (చేతులతో కళ్ళు మూసుకుని) బాలుడు తూలిపోతున్నాడు.

పురుషుడు :

యుద్ధమంతా ఒక మాంచాల మీదుగానే నడుస్తున్నది. ఒకప్రక్క భర్తను రక్షించుకుంటూ మరొకప్రక్క శత్రుసైన్యాన్ని నురుమాడుతూ వుంది. కాని ఒక్క స్త్రీ ఏకాకికా యీ అసంఖ్యాక బలంతో ఎంతసేపు పోరాడగలుగుతుంది ? నాయకురాలు యిదే సమయమని తెలుసుకుని తన సైన్యాన్ని ఉసికొల్పుతూ బాలునిమీదికి విజృంభిస్తూవుంది.

[యుద్ధరంగంలో]

నాయకురాలు :

చమూపతులారా! మీ శౌర్యధైర్యాలు ఏమయినవి? మీ శక్తిసామర్థ్యాలు ఎందులో కలిసినై. ఒక్క బాలునితో యింతసేపా యుద్ధం? నరసింగరాజు హత్యకు యింకెప్పుడు ప్రతీకారం! పదండి.

బాలచంద్రుడు :

మాంచాలా, నీవు అటుచూడు. నేను నాయకురాలిని ఎదుర్కుంటాను. జాగ్రత్తసుమా...జై చెన్నకేశవా!

పురుషుడు :

అయ్యయ్యో...

స్త్రీ :

(కళ్ళు తెరచి) ఏమిటది ?

పురుషుడు :

బాలచంద్రుడు స్పృహలో వుండి యుద్ధంచేస్తున్నట్లు లేదు. తూలిపోతున్నాడు. ఆహా!... ... (సైనికుల హాహాకారాలు, 'స్వామీ' అని మాంచాల కేక)

స్త్రీ :

అయ్యయ్యో! ఎంత అన్యాయం! బాలచంద్రుడు నిలువలేక పోతున్నాడు. నరరూపరాక్షసి, బాలుడు మరొకవీరునితో యుద్ధంచేస్తూ వుండగా దొంగపోటు పొడిచింది. బాలచంద్రునికి అడుగుభూమిమీద ఆనుతున్నట్లే లేదు.

పురుషుడు :

అదుగో మాంచాల. భర్త అండ చేరింది. తన బిడ్డను రక్షించుకోటానికి తెగించి పోరాడే తల్లికిమల్లే పోరాడుతూ వుంది.

స్త్రీ :

కాని ఏం లాభం ? మిగిలిన వీరులెక్కడ ?

పురుషుడు :

వీరారెడ్డి నాయకత్వంక్రింద కొన్ని సైన్యాలు కన్నమదాసుని ఎదుర్కొన్నాయ్. కన్నమదాసు ఎంత ప్రయత్నించీ తమ్ముని సహాయానికి రాలేకపోతున్నాడు.

స్త్రీ :

ఒంటరిగా యీ దంపతులు ఎంతసేపు పోట్లాడుతారు ? క్రమక్రమేణా శత్రు సైన్యాలు బలపడుతున్నాయి.

పురుషుడు :

మాంచాల భర్తకేమో చెప్తోంది.

[యుద్ధ రంగంలో]

మాంచాల :

స్వామీ ! ఒక్కక్షణంమీరు వెనక్కు తగ్గండి. ఈ సైన్యాల్ని నేను అడ్డుకుంటాను.

బాలచంద్రుడు :

లేదు మాంచాలా. వెనుకకు అడుగు వేసే ప్రమేయమే

లేదు. జాగ్రత్త...నా సంగతినాకు వొదిలిపెట్టు...నిన్ను నీవు రక్షించుకో...ఆఁ!!!

మాంచాల :

స్వామీ!...

స్త్రీ :

అయ్యో! మరొక దొంగపోటు. (యుద్ధరంగంలో ఒక ప్రక్క హాహాకారాలు, ఒక ప్రక్క జయజయనినాదాలు)

పురుషుడు :

పలనాటి సింహం నేల కొరిగింది.

స్త్రీ :

గోవు తన దూడను ముసురుకొన్నట్లు ముసురు కుంటూ వుంది మాంచాల. ఆహా! ఎంత హృదయవిదారక దృశ్యం! చుట్టూ మూగుతున్న శత్రు సైన్యాలను ఆమె గమనిస్తున్నట్లు లేదు. కత్తిని జారవిడిచింది. భర్త తలదగ్గర చతికలబడింది. అయ్యో! (హాహాకారాలు) ఎంత నీచానికి ఒడిగట్టావు నాగమ్మా! నిరస్త్రయై భర్తచెంత కూర్చుని వున్న మాంచాలను దొంగపోటు పొడిచింది.

పురుషుడు :

భర్తమీదకు ఒరిగింది.

[సైనికుల్లో హాహాకారాలు, గందరగోళం ఎక్కువవుతై. ఒక ప్రక్క పొలికేకలు, ఒకప్రక్క వీరాలాపాలు ఎక్కువవుతై. రణ దుందుభుల మ్రోతలు దశదిశలా క్రమ్ముకుంటై. 'అన్యాయం' 'అధర్మం' 'చిత్రవధ చెయ్యండి' అని కేకలు మిన్ను ముట్టుతై.]

స్త్రీ :

అదుగో కన్నమదాసు. వీరారెడ్డిని హతమార్చి తమ్ముని కోసం వచ్చిపడ్డాడు.

పురుషుడు :

ఇప్పుడు యెవ్వరు వచ్చి చేయగలిగింది ఏముంది? అదుగో కన్నమదాసుని నాయకురాలు అడ్డుకుంటూ వుంది.

[యుద్ధ రంగంలో]

నాయకురాలు :

సైనికులారా... మీరు కృతార్థులు. నరసింగభూపతి ఆత్మ శాంతించుగాక! అదుగో విరోధి సైన్యం. దాన్ని ఎదుర్కోండి.

స్త్రీ :

నాయకురాలి సైన్యం కన్నమదాసు మీదికిదూకింది. ఈ వీరదంపతులను వదిలింది. వారు పూర్తిగా మరణించి నట్టేనా ?

[యుద్ధ రంగంలో]

[బాలుడూ, మాంచాలా పడిపోయి వుంటారు. చుట్టూ అనేక శవాలు విరజిమ్మబడినట్లు పడివుంటై. సైనికులు కేకలు వేసు కుంటూ అటూయిటూ పరిగెత్తుతుంటారు. కొంచెం దూరంలో యుద్ధం జరుగుతూ వుంటుంది.]

మాంచాల :

(నెమ్మదిగా తలెత్తి) స్వామీ !

బాలచంద్రుడు :

(కళ్లు తెరచి) మాంచాలా! ఇంకా దగ్గరకు రా. (మాంచాల ప్రబల ప్రయత్నంమీద దగ్గరకు జరుగుతుంది) నా ధర్మం నెరవేర్చుకున్నాను.

మాంచాల :

తల్లి ఋణం తీర్చుకున్నాం స్వామీ... స్వామీ... మీ పాదాలను ఒక్కసారి స్పృశించ నివ్వండి.

[బాలుడు కాళ్ళు కదల్చలేకపోతాడు. మాంచాల నెమ్మదిగా కదిలి అతని పాదాలమీద తల ఆనుస్తుంది.............]

బాలచంద్రుడు :

పలనాటి మాత సర్వాంగ శోభితంగా విలసిల్లా లనే నీ కోర్కె నెరవేరుగాక.

మాంచాల :

స్వామీ. అదుగో పలనాటిమాత. నన్ను రమ్మని చేతులు చాస్తూ వుంది. తల్లి అంకంలో తలదూర్చి విశ్రాంతి తీసుకోవాలని వుంది స్వామీ... చెన్న కేశవా! (మరణిస్తుంది)

బాలచంద్రుడు :

(గ్రహించి) మాంచాలా! మాంచాలా! అయ్యో నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోయావా? మాంచాలా! నీకు అదే ధర్మం. మాంచాలా!.........(మూర్ఛపోతాడు) నెమ్మదిగా నాయకురాలు రక్తసిక్తాంగంతో, రక్తంలో

తడిసి బొట్లు రాలుస్తున్న కరవాలంతో ప్రవేశిస్తుంది. ఇద్దరినీ పరీక్షగా చూస్తుంది. బాలుడు కొనవూపిరితో కదుల్తాడు. మరణిస్తాడు. నాయకురాలు నెమ్మదిగా కత్తిని తుడుచుకుని యుద్ధం జరుగుతున్న వైపుకు కదులుతుంది. సైనికుల కోలాహలం – నినాదాలు – హాహాకారాలు – రణదుందుభుల మ్రోతలతో దిక్కులు పిక్కటిల్లుతై.)

—[తెర]—

# భరత వాక్యం

[కొన్ని రోజులతర్వాత, గురిజాలలో నలగామరాజ ప్రాసాదము ఆవరణ. మధ్యన రత్నాల పేరమ్మ సమాధి వుంటుంది. దాని మీద రత్నాల పేరమ్మా, ఆమె భర్త అలరాజూ, ప్రక్కప్రక్కన కూర్చుని ఉంటారు.]

[చదువరులకు ఒక్క మనవి. ఈ రంగంలో వచ్చే పాత్రలన్నీ ఆకారాలే. ఈ లోకానికి సంబంధించినవి కావు.]

పేరమ్మ :

గాలి నిన్నటి కంటే బరువెక్కింది.

అలరాజు :

కార్యమపూడి కదన రంగంలో ప్రక్షాళితమైన మలి నాన్ని మోసుకు వస్తూవుం దీగాలి.

పేరమ్మ :

పిరజిమ్మబడిన చెడు ఆలోచనల బరువుతో క్రుంగి పోతూవుం దీగాలి.

అలరాజు :

పలనాటి యుద్ధం తుదిరోజు యిదే!

పేరమ్మ :

ఎంత విసుగ్గా వున్న దిక్కడ!!

అలరాజు :

నువ్వు రావలసింది కా దిక్కడికి. పొరపాటుచేశావు.

పేరమ్మ :

నే నిలా అనుకోలేదు. ఈ లోకం ఆనందనిలయం అనుకున్నాను. భూలోకంలో వున్నప్పుడు మీతో కలిసి వుండే భాగ్యం ఎట్లాగూ కలగలేదు. ఇక్కడ కలుగుతుంది గదా అని ఆశ పడ్డాను.

అలరాజు :

ఇక్కడ కలిసి వుండటం వల్ల వచ్చే ప్రయోజనం లేదని తెలుసుకోలేక పోయావు. ఈ లోకమే వేరు ! ఇక్కడి అనుభూతులే వేరు. చూస్తున్నావు గదా ? ఎంత ప్రయత్నించినా నిన్ను, మిగిలినవాళ్ళను చూచినట్లు మాత్రమే చూడ గలుగుతున్నాను. నీవు నా భార్యవనీ, నా కోసం ప్రాణాలను త్యజించిన పుణ్యవతివనీ, ఏ విధమైన ప్రత్యేకతనూ పోషించుకోలేక పోతున్నాను.

పేరమ్మ :

చెప్పుకుంటే సిగ్గుచేటు. నా పనీ అట్లాగే వుంది. చితి ప్రవేశించే టప్పుడు ఎన్నో ఊహలు ఊహించాను. చితి నుంచి బయలుదేరినప్పుడు మిమ్మల్ని చేరటానికి ఎంతో ఉవ్విళ్ళూరాను. కాని, తీరా మీదగ్గరకు చేరేటప్పటికి మిమ్మల్ని ఎరిగిన మనిషిని చూచినట్లుగా మాత్రమే చూడ గలుగుతున్నాను.

అలరాజు :

మనం ఏమనుకొని ఏం ప్రయోజనం ? ఇది ఈ లోక ధర్మం. ఈ లోకంలో అడుగు పెట్టినప్పటినుంచీ ఈ లోకా

నికి సంబంధించిన నియమాలే మనకు వర్తిస్తాయి. అది తెలుసుకోలేక మనం ఎన్నో భ్రమలకు లోనయ్యాం.

పేరమ్మ :

ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే నేను చేసిన పనులన్నీ పసివాళ్ళుచేసే చిలిపి పనులుగా కనుపిస్తున్నాయి. (ఈ మాటలకు అలరాజు తనలో తను నవ్వుకుంటాడు. పేరమ్మ గమనిస్తుంది.) అప్పటికి మీరు యీ లోకంలోనే వున్నారు. ఈ లోకంనుంచే నేను చేసిన పను లన్నిటినీ పరీక్షిస్తూ వుండివుంటారు. మీ హత్యాకాండను విని నేను గుండెలు బాదుకుంటూ ఏడ్చాను. నా తండ్రిని అనరాని మాటలు అన్నాను. మంగళ వాయిద్యాలతో ఊరేగి చితిని ప్రవేశించాను. ఈ నా చర్యలను చూసి అప్పుడు-యిప్పుడు నవ్వుకున్నట్టే మీలో మీరు నవ్వుకున్నారా?

అలరాజు :

నిజం చెప్పనా?

పేరమ్మ :

చెప్పండి.

అలరాజు :

నువ్వు నీ తండ్రిని దూషిస్తుంటే, సమయం కనిపెట్టి నాయకురాలిని గురిజాల రాజ్యంనుంచి వెళ్ళగొట్టటానికి ప్రయత్నిస్తున్నా వనుకొన్నాను. లేకపోతే నా హత్యకు నరసింగరాజు కారణమైతే నువ్వు నాయకురాలిమీందకు బండి తోలటం ఎందుకు? కాని తీరా నీ ధోరణి చూస్తే నేనే

సందిగ్ధంలో పడ్డాను. వారందరిమీదా కసి తీర్చుకోవటం కంటే నీ కే ఉద్దేశం లేదని తెలుసుకుని ఆశ్చర్యపడ్డాను. నీకు నాయకురాలంటే మొదటినుంచీ గిట్టదని నాకు తెలుసు. నీ తండ్రికి ఆమె అంటే విపరీతమైన నమ్మకం. అది నువ్వు సహించలేకపోయావు. నా మరణాన్ని సాకుగా తీసుకుని ఆమెమీదికి నీ కసిని ప్రసరింపజేశావు. ఆమెను గాఢంగా నమ్మినందుకు నీ తండ్రిని నోటికివచ్చినట్లు దూషించావు. నీ తండ్రి నువ్వు చెప్పినట్లు చేస్తానన్నా నువ్వు వినలేదు. మలిదేవుని మాచర్ల భాగం అతని కిచ్చి సంధిచేసుకుంటా నన్నా నువ్వు చెవికి ఎక్కించుకోలేదు. నా భర్త లేని యీ లోకంతో నాకేం పని అన్నావు. నన్ను కాపాడలేని యీ పలనాడులో జిల్లేడు మొక్కలు మొలవాలని శపించావు. సర్వనాశనాన్నే నువ్వు కోరావు. నువ్వు చితి ఎక్కబోయే వరకూ చివరికైనా నీ తండ్రిమాట వినకపోతావా; పలనాటి క్షేమం కోరకపోతావా ? అని నేను ఆశపడ్డాను. కాని నీ కసిలో నీకు మంచీ చెడ్డా తెలియలేదు. నువ్వు అగ్నిలో ప్రవేశించి పలనాటి మాత హృదయంలో ఆరని చిచ్చు రగిల్చావు.

ఫేరమ్మ :

(సాలోచితంగా) అందుకేనా, నేను యిక్కడికి రాగానే పెడపెడగా, అనుమానం అనుమానంగా చూశారు నన్ను ?

అలరాజు :

అవును. నువ్వు నీతోపాటు భూలోకానికి సంబంధిం

చిన కొన్ని అనుభూతులను తీసుకువచ్చావు. అవి తాత్కాలికంగా నన్నూ లోబరచుకొన్నాయి.

పేరమ్మ :

అప్పుడు నా మనస్సులో ఏమి ఆలోచనలు వున్నవో కాని పైకిమాత్రం మీరులేని లోకంనుంచి వైదొలగాలనే అపేక్ష పడ్డాను. మిమ్మల్ని హత్య చేసింది నరసింగరాజే అయినా వెనుకనాయకురాలి పన్నాగం వున్నదనే నమ్మాను.

అలరాజు :

నాయకురాలు ఏం చేసినా నీ తండ్రి క్షేమం కోరి చేస్తుందని నీకు తెలుసు.

పేరమ్మ :

అవును.

అలరాజు :

నన్ను హత్యచేసి, నీ హృదయాన్ని ముక్కలుచేసి, నలగామరాజు వంశాన్ని నిర్మూలించటం నీ తండ్రికి క్షేమాన్ని కూర్చటం కాదని నీవైనా అంగీకరించాలి.

పేరమ్మ :

నిజమే.

అలరాజు :

యదార్థం చెప్పాలంటే · నాయకురాలు నాకు ముందుగా తగు జాగ్రత్తలో వుండమని తాను నమ్మిన బంటుద్వారా హెచ్చరిక చేసిందికూడా.

పేరమ్మ :

మరి మీా రెందుకు ఆమె హెచ్చరికను నిర్లక్ష్యం చేశారు.

అలరాజు :

అదే నాకూ అర్థం కాలేదు. ఆ మాటకే వస్తే, నేను గురజాల సమీాప ప్రాంతాలకు వచ్చినప్పటినుంచీ నాకు ఎందుకనో ప్రపంచంమీాద విరక్తిపుడుతూ వచ్చింది. మరణించాలనే కోర్కె క్షణ క్షణానికీ బలపడుతూ వచ్చింది. ఆ రాత్రి అన్నం కలుపుకొని తొలిముద్ద నోటిలో పెట్టుకో బోయేముందు "యీా అన్నం విషకలితాన్నం అయి వుంటుంది" అనే అనుమానం నాకు కలిగింది. కాని వెంటనే "అయితే అయిందిలే" అనిపించింది.

పేరమ్మ :

(నిట్టూర్చి) ఇప్పుడు ఏమనుకొని ఏం ప్రయోజనం!

అలరాజు :

కారణం ఏదైతేనేం, ప్రస్తుతానికి యీా లోకంలో వున్నాం.

పేరమ్మ :

విసుగు పుట్టినప్పుడు భూలోకాన్నుంచి మరణించి, తప్పించుకోవచ్చు. ఈ లోకాన్నుంచి మాత్రం తప్పించు కునే మార్గం వున్నట్టు కనుపించదు.

ఆలరాజు :

ఎందుకు వుండదు ?— .ఉంటుంది. కోర్కెకు తగిన బలం వచ్చినప్పుడు, దారి దానంతట అదే కనుపిస్తుంది.

పేరమ్మ :

మీకు 'విషకలి తాస్నం'– నాకు 'అగ్ని ప్రవేశం' కనుపించినట్లా ? (ఇద్దరూ నవ్వుకుంటారు. అట్లాగే ఒకప్రక్క ఒకరు కూర్చుని వుంటారు. కాలం ఎంతసేపటికీ గడవదు. కరడు కట్టుకుని కూర్చుంటుంది.) మాంచాలా, 'బాల చంద్రులూ ఎందుకు యింత ఆలస్యం చేస్తున్నారో !!

ఆలరాజు :

యుద్ధం యెప్పుడో అయిపోయి వుంటుంది. కాని వీళ్ళుమాత్రం చచ్చిన బంధువుల్నీ, పాత స్నేహితుల్నీ తిరగవేస్తూ వుండి వుంటారు. వాళ్ళీ లోకానికి వచ్చి కొద్ది కాలమే అవటంవల్ల వాళ్ళకి భౌతిక వాసనలు యింకా పూర్తిగా వదల్లేదు. భూలోకంలో వుండే వ్యామోహాలన్నీ వాళ్ళని యింకా ప్రేరేపించ గలుగుతున్నాయి.

పేరమ్మ :

(దిక్కులు పరికించి) గాలి తేలికబారుతూవుంది.

ఆలరాజు :

ఎవ్వరో వస్తూ ఉండివుండాలి.

పేరమ్మ :

అదుగో ! మాంచాలా బాలచంద్రుడూ వస్తున్నారు.

[ఒక గాలికెరటం గిజగిజ లాడుతూ ప్రవేశిస్తుంది. మాంచాలా బాలచంద్రులను ఆలరాజు పేరమ్మల ముందు దింపుతుంది.]

పేరమ్మ :

జయం ఎవ్వరిది ?

బాలచంద్రుడు :

అదే తేలలేదు. జయం నాయకురాలిదే అని నే నంటున్నాను. కాదు బ్రహ్మన్న మంత్రిదే నంటుంది మాంచాల.

పేరమ్మ :

ఏం మాంచాలా ? ఏం జరిగింది ?

మాంచాల :

ఏమీ లేదు. [ భారంగా మాట్లాడుతుంది ] మీతో చెప్పిన ప్రకారం మేము కార్యమపూడి కదనరంగానికి వెళ్ళాం. మేము వెళ్ళేటప్పటికే ఆఖరిరోజు యుద్ధం ప్రారంభమైంది. అప్పటికే యిరుపక్షాల వీరులూ మరణించారు. ఒకప్రక్క మలిదేవభూపతీ, రెండవప్రక్క నలగామరాజూ యుద్ధరంగం ప్రవేశించారు.

బాలచంద్రుడు :

ఒక సంగతిమాత్రం మీరు జ్ఞాపకం వుంచుకోండి. అటు నాయకురాలూ, యిటు బ్రహ్మన్నమంత్రీ తమ తమ రాజులను రక్షించే నెపంతో రాజులను ముందుకునెట్టి తాము వెనక ఉన్నారు.

మాంచాల :

అదే నేను ఒప్పుకోను. రాజులు యుద్ధరంగం ప్రవేశించినప్పుడు అనుచరులకు వారిని రక్షించటమే కర్తవ్యమవుతుంది... మామగారు చెడుపని చెయ్యరు.

అలరాజు :

అది నిజమే బాలచంద్రా.

బాలచంద్రుడు :

కాదు అలరాజా, రాజులను రక్షించే నెపంతో తమ్ము తాము రక్షించుకున్నారు వీళ్ళిద్దరూనూ. అందుకనే రాజులు మరణించినా వీళ్ళిద్దరూ చెక్కుచెదరకుండా మిగిలారు.

పేరమ్మ :

ఏం మాంచాలా ?

మాంచాల :

రాజులు మరణించినమాట నిజం. వీరిద్దరూ బ్రతికి వున్నమాట నిజం.

బాలచంద్రుడు :

చూశావా ?

అలరాజు :

తప్పేముంది ?

బాలచంద్రుడు :

తప్పులేదూ ?

అలరాజు :

ఇంతవరకు లేదు.

పేరమ్మ :

తరువాత ఏం జరిగింది, మాంచాలా ?

బాలచంద్రుడు :

అది చెప్పు.

మాంచాల :

తరువాత జరిగినసంగతి నాకూ నచ్చలేదు.

అలరాజు :

ఏం జరిగింది ?

మాంచాల :

అంతా మరణించారు. ఇటు మామగారూ, అటు నాయకురాలూ మిగిలారు. అప్పుడు మామగారు కత్తి చేత పట్టుకొని నాయకురాలి మీదకు నడిచారు.

బాలచంద్రుడు :

నాయకురాలి పని పూర్తి అయింది అనుకున్నాం.

మాంచాల :

వారు నడుస్తుంటే భూమి దద్దరిల్లినట్లే కనిపించింది.

బాలచంద్రుడు :

సర్వనాశనం అయినా "జయం మనదే" అనుకున్నాం.

మాంచాల :

నాకల నిజమయింది అనుకున్నాను.

బాలచంద్రుడు :

నాకు తెలియకుండానే "బ్రహ్మన్నమంత్రికీ జై" అన్నాను.

మాంచాల :

చాపకూడు సిద్ధాంతం చిరకాలం వర్ధిల్లాలి అన్నాను నేను. కాని వారు తీరా నాయకురాలి దగ్గిరకువెళ్ళి ఏం చేశారనుకున్నావ్ ?

పేరమ్మ :

ఏం చేశారు ?

మాంచాల :

నాయకురాలి దగ్గిరకు వెళ్ళి ఆమెను ఒక్కసారి ఎగాదిగా చూశారు.

బాలచంద్రుడు :

మేము ఊపిరి బిగబట్టుక చూస్తున్నాం.

మాంచాల :

నాయకురాలు నేలమీదికి ఒరిగిందే అనుకున్నాం.

బాలచంద్రుడు :

పలనాటి శని నేటితో తొలిగిపోయింది అనుకున్నాం.

అలరాజు :

అప్పు డేమయింది ?

బాలచంద్రుడు :

చెప్పు మాంచాలా ! చెప్పు.

మాంచాల :

అప్పుడు వారు తన కత్తి నెత్తి, నాయకురాలి చేతిలో పెట్టి "నువ్వే గెలిచావు నాగమ్మా! ఈ పలనాటి సీమను ఏలటానికి నువ్వే అర్హురాలివి. ఈ పలనాటిని నీకు అప్పజెప్పి నేను వెళ్ళిపోతున్నాను. మిగిలిన కాలం గుత్తికొండ బిలంలో తపస్సు చేసుకుంటూ కాలం గడుపుతాను" అన్నారు.

అలరాజు :

ఆహా! త్రికాలవేది, బ్రహ్మన్నమంత్రి!

బాలచంద్రుడు :

ఏమి అలరాజా! (ఆశ్చర్యంగా) బ్రహ్మన్న మంత్రి చేసిన పనిని నువ్వు హర్షిస్తున్నావా?

అలరాజు :

అవును. బాలచంద్రా! ఆయన ఈ లోకానికి చెందిన మనిషి. మర్త్య లోకంలో వుండబట్టి ఆ లోకానికి సంబంధించిన వ్యవహారాలకు తనకు తానుగా లోనై వుంటు న్నాడు. కాని వస్తుతః ఆయన భూలోకానికి అతీతమైన జ్ఞానం కలవాడు.

బాలచంద్రుడు :

ఈ పనికై తే యీ యుద్ధం ఎందుకు రావలసి వచ్చింది?

మాంచాల :

ఇప్పుడు, మనల్ని ఎంతో ఆకర్షించిన చాపకూడు సిద్ధాంతం గతి ఏమయినట్టు??

పేరమ్మ :

ఈ సర్వనాశనం ఎందుకు సహాయపడినట్లు ?

బాలచంద్రుడు :

నేను ఎందుకు యుద్ధానికి దిగినట్లు ?

మాంచాల :

పలనాటి మాత పిలుపు ఏవిధంగా నెరవేరినట్లు ?

బాలచంద్రుడు :

ఇదంతా స్వార్థం. బ్రహ్మన్న మంత్రి స్వార్థం. ఈ యుద్ధం ఆయన తన స్వార్థంకోసమే సృష్టించాడు, తన స్వార్థంకోసమే యిప్పుడు పలనాటిని నాయకురాలికి అప్పగించి గుత్తికొండ బిలం ప్రవేశించాడు. నాకు ఒకప్పుడు నరసింగ రాజు చెప్పాడు - మలిదేవభూపతిని అడ్డుపెట్టుకుని తానే రాజ్యం చేయాలనే వాంఛతో బ్రహ్మన్న మంత్రి యీ యుద్ధాన్ని లేపాడని. నే నప్పుడు అతని మాటలు నమ్మలేక పోయాను. అతను చెప్పింది నిజం. తన స్వార్థంకోసం తాను పన్నిన చదరంగంలో మనల్నందర్నీ బంటులుగా వాడాడు యీ బ్రహ్మన్న మంత్రి.

అలరాజు :

నువ్వు పొరపడుతున్నావు బాలచంద్రా. విష్ణుమూర్తి బ్రహ్మనాయని నువ్వు సాధారణ మానవుణ్ణి కొలిచే కొలబద్దతో కొలిచి పాపానికి ఒడికట్టుకొంటున్నావు.

బాలచంద్రుడు :

లేదు. అలరాజా, లేదు. ఆయన నాకు తండ్రి. నేను ఆయన పుత్రుడను. నాకు ఆయన సంగతి తెలుసు. తన స్వార్థానికి అడ్డువచ్చిన ఎవర్నయినా మట్టుపెట్టటానికి సంశయించని దుర్మార్గు డతడు. ఒకప్పుడు జ్యోతిష్కులు ఏదో చెప్పారనే నెపంతో కన్నకొడుకుని ముక్కుపచ్చలారని ప్రాయంలో కడముట్టించమని ఆజ్ఞాపించిన కిరాతకుడు యీ బ్రహ్మన్నమంత్రి. ఆయన చరిత్రంతా నా కిప్పుడు అర్థం అవుతూ వుంది. అలరాజా! తనను నమ్మి వచ్చిన మేనల్లుణ్ణి చంపించాడు. చెవులరాయుణ్ణీ వెంకన్నజోదునీ కపటోపాయంతో చంపించిన చండకర్మ డతను. నిన్నుకూడా తెలిసి తెలిసే రాయబారిగా గురిజాలకు పంపించాడు. నేను యుద్ధరంగానికి వచ్చినప్పుడు "యుద్ధం అంటే యేమనుకున్నావ్! నాయకురాలి తరఫున వున్న వీరులను గెలిచే మొనగాడు మన సైన్యంలో ఏడీ?" అని నన్ను రెచ్చగొట్టాడు. "నరసింగరాజు తలను తెచ్చే భారం నాది" అని నేను ప్రతిజ్ఞ చేసేవరకు నన్ను పురెక్కించాడు. తీరా నేను నరసింగరాజు తలను తెచ్చేటప్పటికి నన్ను అనరాని మాటలు అన్నాడు. మొసలికన్నీరు కారుస్తూ "నిన్నెవరు యుద్ధానికి రమ్మన్నారు? రాజు రమ్మనలేదు. నేను రమ్మనలేదు. వచ్చిన వాడవు వచ్చినట్లు వూరుకున్నావా అంటే అదీ లేదు. మా పాలిటి విధివి అయ్యావు" అని దూషించాడు. అలరాజా! మనం అందరం మోసపోయాము. చివరకు తాను నాయకురాలిని ఎదుర్కోవలసి వచ్చేటప్పటికి పిరికిపందయై, కత్తిని

విడిచి, యెవ్వరిమీద పగతో మనం మన ప్రాణాలను అర్పిం చామో ఆమెకే పట్టాభిషేకం చేశాడు. అహా! ఎంత మోసం! ఎంత అమానుషం!! మాంచాలా! మనందరం బ్రహ్మన్నమంత్రి చేతుల్లో కీలుబొమ్మలమే! ఆయన ఆడ మన్నట్టు ఆడాం... అంతే...

మాంచాల :

నా కంతా అయోమయంగా వుంది...

పేరమ్మ :

(అలరాజుతో) మీరు మాట్లాడరేం?

అలరాజు :

బ్రహ్మన్నమంత్రి ఔన్నత్యం యిప్పుడు బాలచం ద్రుడు చెప్పేవరకు నేనుకూడా పూర్తిగా గ్రహించలేక పోయాను. బ్రహ్మన్నమంత్రికి "పోరునష్టం, పొందు లాభం" అని తెలుసు. యుద్ధం నాశనకారి అని ఆయనకు తెలుసు. అందుకని శాంతికోసం ఆయన తన సర్వశక్తులనూ కేంద్రీక రించి పనిచేశాడు. శాంతిక తన కన్నకొడుకు అడ్డని తోచి నప్పుడు అతన్ని తొలగించటానికికూడా వెనుదీయని స్వార్థ రహితు డాయన. బాలచంద్రా! నిన్ను చంపమని ఆయన ఎప్పుడు ఆజ్ఞ యిచ్చాడో నా కిప్పుడు జ్ఞాపకం వచ్చింది. నువ్వు పుట్టినప్పుడు జ్యోతిష్కులు నీవు పలనాటి నాశ నానికి కారకు డవవుతావని చెప్పారు. అప్పుడు పలనాటి క్షేమంకోరి, వారు నిన్ను వదులుకోటానికి సిద్ధపడ్డారు. నిన్ను తమతోపాటు యుద్ధానికి తీసుక వెళ్ళక పోవటానికి

కూడా యిదే కారణం అయివుంటుంది. కాని విధి ఆయన కూడా అతిక్రమించరాని దయింది. నువ్వు యుద్ధానికి వెళ్ళనే వెళ్ళావు. సంధిని చెడగొట్టావు. సర్వనాశనానికి దారి తీశావు. నువ్వు యుద్ధ రంగంలో ప్రవేశించి నప్పుడే బ్రహ్మన్నమంత్రికి తెలుసు, సర్వనాశనం తప్పదని—ఫలితం తన చేతులు దాటిపోయిందని. ఇవన్నీ మనస్సుని కలవర పెట్టటం వల్లే నీవు నరసింగరాజు తలను తీసుకువచ్చి నప్పుడు తన ఆవేశాన్ని ఆపుకోలేక నిన్ను దూషించి వుంటారు. నువ్వు యుద్ధరంగం ప్రవేశించినప్పటినుంచీ ఆయన పరిస్థితులను అనుసరించాడు. "ఇక నుంచి బాలచంద్రుడే నాయకుడు" అని ప్రకటించాడు; ఇటువంటి వారు తానుగా నాయకురాలిని వధించి రాజ్యం తను పరిపాలించాలని ఏ విధంగా అభిలషించ గలరు బాలచంద్రా? తాను శాంతి కోసం ప్రయత్నించాడు. అది జరగలేదు. ఇక యుద్ధానికీ తద్వారా కలిగిన నాశనానికీ నాయకురాలి బాధ్యత ఎంత వుందో తన బాధ్యతా అంతవుంది. ఆ సంగతి ఆయనకు తెలుసు. అందుకనే ఆయన రాజ్య పరిపాలన, నాయకురాలికి వదిలి అద్భుతమైన పని చేశాడు.

మాంచాల :

ఆ క్షణం వారిద్దరు ఒకరితో ఒకరు అన్నీ సంప్రదించుకొని చేస్తున్నట్టే ప్రవర్తించారు.

పేరమ్మ :

ఏం జరిగింది, ఆఖరు క్షణాన?

మాంచాల :

ఈయన కత్తి ఆమె చేతుల్లో పెట్టారు. ఆమె స్వీకరించింది. ఈయన "పలనాటిని పరిపాలించు" అన్నారు. ఆమె 'సరే' అన్నది. ఈయన "యీ బాధ్యత నీమీద పెడుతున్నాను" అన్నారు. ఆమె "నేను సక్రమంగా నిర్వర్తిస్తాను" అన్నది. చివరికి "తుది గెలుపు మీదే" అన్నది ఆమె. ఈయన చిరునవ్వు నవ్వుకున్నాడు.

అలరాజు :

ఆహా !!!

మాంచాల :

ఒక్కక్షణం నాకూ అట్లాగే అనిపించింది. మామగారు చేసిన పని నాకు అర్థం కానిమాట నిజమే. కాని ఎందుకో "తుది గెలుపు మామగారిదే" అనిపించింది. కాని అంతలో "నిలు నిలు" మని వీరు తండ్రికి అడ్డు వెళ్ళటం చూశాను.

బాలచంద్రుడు :

అవును. నేను ఆగలేక పోయాను. ఆ క్షణం నేను భూలోకంతో సంబంధాలు త్రెంచుకుని వున్నాననే సంగతి మరచి పోయాను. బ్రహ్మన్నమంత్రి ఆట కట్టించటం నా విధ్యుక్త ధర్మం అనుకున్నాను.

అలరాజు :

నా ?రేమన్నారు ?

పేరమ్మ :

గమనించి వుండరు.

బాలచంద్రుడు :

గమనించినట్లే కనిపించారు. ఒక్క క్షణం నన్ను ఎగా దిగా చూశారు. నన్ను దాటివెళ్ళిపోయారు. కాని ఆచూపు "నే నిప్పుడు భౌతికసంబంధాల నన్నిటినీ త్రెంచు కొన్నాను. యికనీవు నాగమ్మస్థానం నుంచి నన్ను తప్పించ లేవు" అని భయపెట్టినట్టు అనిపించింది.

మాంచాల :

చివ్వరికి అటువంటి చూపే నామీదకూ ప్రసరింప జేశారు.

అలరాజు :

నీ కేమనిపించింది మాంచాలా ?

మాంచాల :

"నా కుమారుణ్ణి యుద్ధానికి రాకుండా ఆపలేక పోయావు. పైగా అతన్ని పురిగొల్పావు. యుద్ధం నాశన హేతువని తెలుసుకోలేక పోయావు. నాసిద్ధాంతానికీ, తద్వారా ధర్మానికీ చ్యుతిగలిగితే ఆబాధ్యత ఎక్కువ నీదే" అని నిష్ఠురాలాడినట్లు అనిపించింది నాకు.

బాలచంద్రుడు :

ఈ సంగతి నువ్వు నాకు చెప్పలేదేం మాంచాలా?

మాంచాల :

చెప్పి ప్రయోజనం? మీరు వినిపించుకునే స్థితిలో లేరు.

పేరమ్మ :

మనం ఏదో తెలిసీ తెలీకుండా ప్రవర్తించాం గానీ, ఆయన ఎప్పుడూ మహావ్యక్తే. మనకు అందని సత్యం ఏదో ఆయన్ని ఎప్పుడూ కలవరపెడుతూనే వుంది. ఆ సత్యసాధనకు ఆయన యెప్పుడూ ప్రయత్నిస్తూనే వున్నారు.

బాలచంద్రుడు :

( నిద్ర నటిస్తూ ) మీరు మాట్లాడేది నాకు అర్థం కావటంలేదు.

ఆలరాజు :

నీలో భూలోకవాసనలు యింకా ప్రబలంగా వున్నాయి, బాలచంద్రా ! యింకా కొంతకాలం గడిస్తే తప్ప సత్యం బోధపడదు.

బాలచంద్రుడు :

సరే కాసేపు నిద్రపోనివ్వండి.

[ పేరమ్మసమాధికి ప్రక్కన పడుకుంటాడు ]

పేరమ్మ :

మాంచాలా !

మాంచాల :

ఆఁ...

పేరమ్మ :

సరే, మాదేదో ఒకరకం. నువ్వు అటువంటి యుద్ధం ఎలా చేశావమ్మా. అంతమందిని ఎలా చంపావమ్మా? ఎంత రక్తాన్ని ప్రవహింపజేశావు ? ! ! !

మాంచాల :

తలచుకుంటే నాకే ఆశ్చర్యంగా వుంది పేరమ్మా...

పేరమ్మ :

ఆ క్రూరత్వం ఎక్కడనుంచి వచ్చింది నీకు ?

అలరాజు :

మానవులు ఏదో ఒక సిద్ధాంతానికి లోబడినప్పుడు యిటువంటి వికృత తత్వం బయట పడుతూ వుంటుంది. ఒక సిద్ధాంతాన్ని నమ్మటం, జీవితాన్ని ఏదో ఒక నెపంతో సంకుచిత పరచటమే అవుతుంది. జీవితంయొక్క సహజ సమగ్ర పరిణామం కృత్రిమంగా ఆపబడినప్పుడు యిటువంటి దుష్ఫలితాలు కలుగుతూ వుంటై. భూతప్రేత పిశాచాలు ఉద్భవించి చెలరేగుతై. నిన్న మనకొక గాలి పొరలో కనుపించిన వికృతాకారాలు జ్ఞాపకం ఉన్నాయా పేరమ్మా? అవన్నీ యీ విధంగా ఉద్భవించిన భయంకర స్వరూపాలే!!

[ తొలికోడి కూస్తుంది ]

అలరాజు :

(తత్తరపాటుతో) నేను వెళ్ళాలి ... మళ్ళీ రేపురాత్రి కలుసుకుందాం... సెలవు మాంచాలా (నిష్క్రమణ)

పేరమ్మ :

నీ కింకా ఈ లోకంలో ఒక స్థానం నియమితమై వుండదు మాంచాలా! ఈ రాత్రికి నాతో వుందువుగాని రా.

[మాంచాల బాలచంద్రుని వంకకు చూచి పస్తాయిస్తుంది]

పేరమ్మ :

అతన్ని నిద్రపోనియ్... రేపు మనం వచ్చేటప్పటికి లేచి కొత్త మనిషిగా తయారై వుంటాడు... రా...

[ఇద్దరూ సమాధిలోకి నిష్క్రమిస్తారు. పడుకొనివున్న బాలచంద్రుడు ఒక్క సారి కదులుతాడు. మళ్ళీ యధా ప్రకారం నిద్రపోతూ వుంటాడు.......... .. .......]

•

# ముగింపు

ఇది పలనాటి వీరచరిత్ర. పలనాడు ప్రస్తుతం గుంటూరు జిల్లాలోని ఒక తాలూకా. దీనినిగురించి శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు తమ "పల్నాటి వీరచరిత్ర" లో యీ విధంగా వ్రాశారు :

"పలనాటి సీమ కృష్ణానదీ దక్షిణ తీరమున సముద్రమునకు సుమారు 120 మైళ్ళ దూరములో నున్నది. దీనికి ఉత్తరమున, పడమట 75 మైళ్ళ పొడవున కృష్ణానది ప్రవహించుచున్నది. దక్షిణమున కొండల చేతను సాంద్రారణ్యము చేతను నావరింపబడియున్నది. తూర్పున చిన్న యడవులు వ్యాపించియున్నవి. దీనివైశాల్య మించుమించుగ 1050 చదరపుమైళ్ళు. నాగులేరు, చంద్రవంక యనునవి యిచ్చటి ముఖ్యనదులు. వీరచరిత్రలో ప్రధానముగ వచ్చు కార్యమపూడి, మాచర్ల పట్టణములలో మొదటిది నాగులేటి తీరమునను, రెండవది చంద్రవంక యొడ్డునను నున్నవి" పలనాటి వీరుల జన్మభూమి అయిన పలనాడు యిటువంటిది. ఇప్పటికీ పలనాటి వీరుల స్మృతిచిహ్నాలతో చూపరుల మనస్సులను ఉత్తేజపరుస్తూ వుంటుంది.

పలనాటి చరిత్ర వీరరస ప్రధానమైనది. సిద్ధాంతాల మాట అటుంచి, వీరరసం దానంతట అది మానవుల మనస్సులను సమ్మోహపరచగలిగిన శక్తిగలట్టిది. రావణుడు యౌవనోద్రేకంలో చేసిన వీరోచిత కృత్యాలు, దుష్టమయినవైనా, మనస్సులను రంజింపజేస్తవి. అతను కైలాసమును ఎత్తినప్పుడు ఆక్షణం భగవంతునికి అపచారం చేస్తున్నాడని నిందింప బుద్ధి పుట్టదు. 'ఆహా' అని వందించ బుద్ధి పుడుతుంది. ఇదే హిరణ్యకశిపుడికీ వర్తిస్తుంది. హిరణ్యకశిపుడు పెట్టే పిలుగులను ప్రహ్లాదుడు నిర్లిప్తంగా ఎదుర్కొన్నప్పుడు మన మనస్సు ప్రహ్లాదునిమీదికి ఉరకలెత్తే మాట

నిజమే ! కాని హిరణ్యకశిపుడు "జగన్నాథుండ, నాకంటె నీ భూతశ్రేణికి రాజు లేడొకడు" అన్నప్పుడూ, "మున్నే నే వెదకితిం బల్మారు నారాయణుం డేతద్విశ్వమునందు లేడు మరి వాడెందుండురా దుర్మతీ" అన్నప్పుడూ, "ఇక్కడ ఉన్నాడా ?" అని అడిగి "మహోదగ్ర ప్రభాశుంభమున్, జనదృగ్భీషణ దంభమున్ హరిజను స్సంరంభమున్ స్థంభమున్" "మదోద్రేకియై" "కరచేత" వ్రేసినప్పుడూ, నిజంగా ఒళ్లు జలదరిస్తుంది. మనస్సు క్రేళ్ళువారుతుంది. చివరికి "తన సర్వగతత్వము౦ బ్రతిష్ఠింప దలంచి" హరి నరసింహావతారం తాల్చాడనీ, తనకు హరిచేత మృతి తప్పదనీ అనుకుంటూనే అయినా నా ప్రతాపం చూపుతాను అనుకొని, తన "మహోద్దండదంబగు గదాదండంబు గిరగిరం ద్రిప్పి" నరమృగేంద్రుని మొదటిదెబ్బ తానుగా వేసినప్పుడు మనం అతని మనుష్యులం అయిపోతాం. మన మనస్సులలో కర్పూరాలు వెలుగుతై. హారతులు ఎత్తుతాం. అతను భగవంతుడు కనిపించగానే అర్జునునికివలె భయపడలేదు. భీష్మునికి వలె, "నీ చేతిలో మరణంకంటే నా కింకేమి కావాలి ? రా, మధుసూధనా !" అని ఆయనలో లీనం అవటానికి ఉత్సహించలేదు. తన వ్యక్తిత్వాన్ని ఆఖరివరకూ నిలబెట్టుకున్నాడు. భగవంతుణ్ణి తొలిదెబ్బ కొట్టిన ఘనత అతనికే దక్కింది. అది సామాన్యమా ? అంతకంటే గొప్ప గౌరవం యింకేముంటుంది ? అని హర్షించ బుద్ధి పుడుతుంది. శిశుపాలుని మరణంకూడా యిటువంటిదే. ధర్మరాజు రాజసూయం నిర్వహించాడు. అందులో కృష్ణ భగవానుని పెద్దచేసి పూజించాడు. అది చూసేటప్పటికి శిశుపాలునికి రోషం పట్టపగ్గాలు లేకుండా పటుగులెత్తింది. పూజించిన ధర్మరాజుని నిందించాడు. పూజార్హుడని చెప్పిన భీష్ముని నిందించాడు. పూజను స్వీకరించిన పుండరీకాక్షుని నిందించాడు. 'శతాపరాధములు సైచెద' నని జనార్దనుని దగ్గర నుంచి తనతల్లి పొందినవరం సైతం అతన్ని రక్షించలేకపోయింది. ఈ వరం అనే కవచాన్ని ఎప్పుడు తొలగించుకుందామా అనే తహతహతో

క్రాగిపోతున్న వానికివలె ప్రవర్తించాడు. కంఠంలో ప్రాణం వున్నంత వరకు చక్రిని నిందిస్తూనే వున్నాడు. రావణ హిరణ్యకశిపులకువలె ఇతనికీ తెలుసు, తన మరణమాసన్నమయిందని. కాని ప్రాణం పోతుందనే భయం గానీ, ప్రాణాన్ని నిలబెట్టుకోవాలనే కాంక్షగాని పై వారికివలె యితనికీలేదు.

దేనికోసమైనా సరే ప్రాణాన్ని తృణంగా ఒడ్డగలగటం నిజంగా గొప్ప విషయం. ఈగుణం మనుష్యుల మనస్సులను ఎప్పుడూ ఆకర్షిస్తూనే వుంటుంది. ఎప్పుడూ పరవశం చేస్తూనే ఉంటుంది. వీరరసంలో వున్న శక్తియిదే. ఈ శక్తే పలనాటి వీరచరిత్రలో పిలిస్తే పలుకుతూ వుంటుంది. పొంగి పొర్లుతూ వుంటుంది. కేలెత్తి పిలిచి, ఎలుగెత్తి కవ్వించి పాఠకులను లోబరచుకుంటుంది. వీర రసానికి కదలని హృదయం ఎక్కడ వుంటుంది ... ?

అయితే పలనాటి వీరచరిత్రలో సిద్ధాంత సంఘర్షణ లేదని కాదు నా భావం. ఆ సంఘర్షణా వుంది. ఈ సంఘర్షణ బలంమీదే సైన్య సమీకరణ జరిగింది. కాని యుద్ధం ప్రారంభమైనతర్వాత యిరుపక్షాలవారి సిద్ధాంతాలూ, ఆవేశాల మరుగున పడినై. సిద్ధాంతాలను, యుద్ధంవల్ల రేగిన రాక్షసత్వం కప్పివేసింది. ఎవ్వరికి వారికి యుద్ధం గెలవటమే ముఖ్యమైంది. ఈ ఆవేదనలో సిద్ధాంతాలు నాశనం అయినై.

యుద్ధం మానవునిలో వున్న రాక్షసత్వాన్ని ప్రకోపింపజేస్తుంది. ఈ ప్రవృత్తి సిద్ధాంత ప్రచారానికి గానీ, అభివృద్ధికిగానీ అనువైనది కాదు. ఈ సంగతి పలనాటి వీరులలో ఒక్క బ్రహ్మనాయనికి మాత్రమే తెలిసినట్లు కనిపిస్తుంది. కాని ఏ పరిస్థితుల్లోనూ యుద్ధానికి పూనుకోక పోవటంకూడా అపాయకరమే. అది విరోధుల విజృంభణకు దోహదం చెయ్యటమే అవుతుంది. అందుకని బ్రహ్మనాయడు అవసరమైతే యుద్ధానికి సిద్ధం అన్నట్లే కనిపించేవాడు. యుద్ధానికి అవసరమైన సన్నాహాలు చేస్తూనేవుండేవాడు. కాని ఎప్పటికప్పుడు సంధిప్రయత్నాలు చేస్తూనే.

వుండేవాడు. సంధిమీదే ఎక్కువ నమ్మకం ఉంచేవాడు. బలప్రదర్శనం సంధికి సహాయకారి అనే భావనలోనే వుండేవాడు. చివ్వరికి కార్యమపూడి కదనరంగానికికూడా ఈ నమ్మకంతోనే సైన్యాలను నడిపించాడు. కాని అతని నమ్మకాలన్నిటినీ బాలచంద్రుడు వమ్ముచేశాడు. బాలచంద్రుడు కార్యమపూడిలో అడుగు పెటటంతో ఆయన తన నమ్మకాలకు తిలోదకాలు వదిలాడు. భగవదాజ్ఞ అనుకొన్నాడు. పరిస్థితులు ఎటు నడిపితే అటు నడిచాడు. మళ్ళీ తిరిగి సర్వం నాశనం అయి తాను నాగమ్మను ఎదుర్కున్నప్పుడే తన అంతర్వాణి చెప్పినట్టు నడిచాడు. అప్పుడిక ఆయన ఎవ్వరికోసం తన అంతర్వాణి నివ్యసందేశాన్ని పెడచెవిని పెట్టాలి? ఎవ్వరికోసం తన దృక్పథాన్ని సంకుచిత పరుచుకోవాలి? ఎందుకు వ్యామోహాలతో రాజీపడాలి? అప్పుడతను ఎప్పటి బ్రహ్మనాయుడు అయినాడు.

* * * * *

పలనాటి కథకూ నా జీవితానికీ చాలా దగ్గర సంబంధంవుంది. మా నాన్నగారి మొదటి పుస్తకం పలనాటి వీరచరిత్రకు సంబంధించినదే। దానిపేరు "కారంపూడి కదనం". నా చిన్నతనంలో యీ నాటకం అంగలూరు, చేటపల్లి మొదలైన గ్రామాలలో ఆడటం నేను చూశాను. ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపకం - బాలచంద్రుని పాత్ర చేటపల్లి గ్రామస్తులైన సంగీతం సుబ్బయ్యగారు ధరించేవారు. వారి అభినయం నా కిప్పటికీ కన్నులముందు మెదులుతూనే వుంటుంది.

ఈ నాటకం వ్రాతప్రతి చాలాకాలంవరకూ మాయింట్లో వుంటూ వుండేది. మేము పెరిగి పెద్దవాళ్ళం అయింతర్వాత కూడా మేము ఆ గ్రంథాన్ని తిరగవేస్తూ వుండేవాళ్ళం. నేను తరువాత కొన్నాళ్ళకు శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారివద్ద, వారు తీయబోయే చిత్రానికి సంభాషణలు

వ్రాయటానికీ, అసిస్టెంటు డైరెక్టరుగ పని చెయ్యటానికీ ప్రవేశించాను. అప్పుడు వారు పలనాటి యుద్ధాన్ని తీయాలని సంకల్పించుకొని నన్ను పలనాడు తిరిగి చిత్రానికి కావలసిన వస్తుసామగ్రిని సేకరించవలసిందని కోరారు. నేను అమితోత్సాహంతో బయలుదేరాను. పలనాడు ఈ కొన నుంచి ఆకొనవరకూ తిరిగాను.

ఆవి కార్యమపూడిలో వీరుల పూజ జరిగే రోజులు. నేను అక్కడికి వెళ్ళాను. అక్కడికి వచ్చిన ప్రజలు చెప్పుకునే కట్టుంకథలను విన్నాను. అనేక బుర్రకథలను విన్నాను. నాతో వచ్చిన శ్రీ అడుసుమిల్లి బసవయ్యగారు ఆ దృశ్యాల నన్నిటినీ ఫొటో తీశారు. నేను తిరిగివచ్చి ఆ ఫొటోలతో, సేకరించిన విషయాలతో 'ప్రజామిత్ర' లో ఒక పెద్దవ్యాసం ప్రకటించాను. కాని అప్పటికి శ్రీ రామబ్రహ్మంగారు పలనాటి వీరచరిత్రను చిత్రంగాతీసే ప్రయత్నాన్ని విరమించి, 'రైతుబిడ్డ' ను తియ్యాలని సంకల్పించటంతో ఈ ప్రయత్నం తాత్కాలికంగా ఆగింది. నేను వారిదగ్గర 'రైతుబిడ్డ' కు సంభాషణా రచయితగానూ, అసిస్టెంటు డైరెక్టరుగానూ పని చేశాను. రైతుబిడ్డ విడుదలయిం తర్వాత వారు మరొక చిత్రాన్ని చేపట్టారు. ఈ విధంగా కాలం గడిచిపోయింది. నా జీవితంలో ఎన్నో మార్పులు వచ్చాయి. చివరికి వారు తీరా పలనాటి యుద్ధాన్ని చిత్రంగా తియ్యాలని మళ్ళీ పూనుకునేటప్పటికి నేను ఆయనదగ్గర లేను. చిత్రం నేను లేకుండానే పూర్తయింది. ఆ రోజుల్లో నే నీ నాటకం వ్రాసి రేడియోలో బ్రాడ్‌కాస్టు చేశాను. ఈ నాటకంలో ఆ ప్రదర్శనంలో ప్రఖ్యాత సినిమా నటకులైన శ్రీయుతులు అక్కినేని నాగేశ్వరావు, లింగమూర్తి, నటీమణి కమలా, చంద్రబాబు మొదలైనవారు పాల్గొని విజయవంతం చేశారు. ఆ నాటకాన్నే యిప్పుడు కొన్ని మార్పులలో యీ పుస్తకంగా ప్రచురిస్తున్నాను.

ఇంతకుముందు నేను మా నాన్నగారు తమ సాహిత్య వ్యాసంగాన్ని పలనాటికథతో ప్రారంభించారని చెప్పాను. చిత్రం ఏమిటంటే, వారు తమ సాహిత్య వ్యాసంగాన్ని పలనాటికథతోనే ముగించారు. వారి ఆఖరి గ్రంథం 'భగవద్గీత' పలనాటి చరిత్రకు సంబంధించినదే.

ఈ విధంగా పలనాటి చరిత్రకూ, నాకూ చాలా సన్నిహితత్వం వుంది. ఆ సన్నిహితత్వాన్ని పురస్కరించుకొని ఈ నాటకం వ్రాయటానికి పూనుకున్నాను. నేను యీ నాటకంలో శ్రీనాధుడు రచించిన ద్విపద కావ్యంలో పొందుపరచబడిన కధావస్తువులో సాహసించి కొన్ని మార్పులు చేశాను. ఆ మార్పుల్లో ముఖ్యమైనది మాంచాల యుద్ధంలో పాల్గొనటం. శ్రీనాధుని ద్విపదకావ్యంలో మాంచాల తన భర్తను యుద్ధానికి పురికొల్పుతుందేగాని తానుగా యుద్ధరంగం ప్రవేశించదు. కాని నేను విన్న కధలు కొన్నింటిలో మాంచాల యుద్ధం చేసినట్లు పేర్కొనబడివుంది. అంతేకాక మా నాన్నగారి ప్రియశిష్యులలో ఒకరైన 'కవి బ్రహ్మ' కీ. శే. ఏటుకూరి వెంకట నరసయ్యగారు వారువ్రాసిన వీర భారతంలో మాంచాల యుద్ధరంగం ప్రవేశించిందనే వ్రాశారు. నేను యీ జాలునే అనుసరించాను.

* * * * *

పలనాటి వీర చరిత్రను శ్రీనాధుడు మంజరీ ద్విపదలో వ్రాశాడు. ఆయన పూర్వ గ్రంథాలైన శృంగార నైషధం, భీమేశ్వర పురాణం, కాశీఖండం, హర విలాసం, మొదలైన గ్రంథాలను చదివిన పండితులు ఈ ద్విపద కావ్యం శ్రీనాధునిది కాదేమో అని శంకిస్తారు. ఈ శంకకు ఆస్కారం లేదని నా నమ్మకం.

కవుల్లో, సామాన్య మానవుల్లో సైతం, ద్వంద్వ ప్రవృత్తి గలవారు చాలామంది వుంటారు. అనేకమంది కవులు నిర్మలమైన భావాలతో

కావ్యాలు వ్రాసి, తమ రెండవ ప్రవృత్తిని చాటువులద్వారా వెలిబుచ్చుకుని వున్నారు. సామాన్య మానవుల్లోకూడా ఈ లక్షణాలను మనం చూస్తూనే వుంటాం. ఒక్కొక్కవ్యక్తి అతి గంభీరంగా మాట్లాడుతూ మాట్లాడుతూ, అకస్మాత్తుగా బూతుల పంచాగం విప్పుతుంటాడు. శ్రీనాధునిది యిటువంటి ద్వంద్వ ప్రవృత్తి అని అతని జీవితాన్ని పరికిస్తే తేలికగా బోధ పడుతుంది. అందుకని కాశీఖండం, హరవిలాసం వ్రాసిన శ్రీనాధుడే అతనిపేర చలామణీ అవుతున్న వీధినాటకాన్ని, చాటువులనూ, ఈ ద్విపద కావ్యాన్నీ వ్రాశాడని నా నమ్మకం. ఈ కావ్యాన్ని పండితులు మెచ్చని ద్విపదలో వ్రాశాడనే తప్ప, వీధి నాటకంలో వున్న నీచతగానీ, చాటువులలో వున్న వెటకారంగానీ యిందులో లేదు. పైగా మంచి పనితనం వుంది. ఈ పనితనానికి ఉదాహరణగా కీ. శే. అక్కిరాజు ఉమాకాంతంగారు వేశ్యమాతను శ్రీనాధుడు, కొండయ్య, మల్లయ్య వర్ణించిన ఘట్టాలను చూపించారు. ఈ వర్ణనలను చదివితే శ్రీనాధుని పనితనం తెలియటమేకాక, పలనాటి వీరచరిత్ర పండిత పామరరంజకం అవటానికి కవి చతురత ఎంతవరకు సహాయపడుతుందో బోధపడుతుంది. ఉదహరిస్తున్నాను :....

## వృద్ధ వేశ్యావర్ణనము

శ్రీనాధుడు :

"కోతివంటిది వృద్ధ గురుతరకోపి
కోల పట్టుకవచ్చి తూతు దగ్గరకు
విరిగిన రొండియు వ్రేలు చన్దోయి
యురిసిపోయిన యొళ్ళు నూచలు కాళ్ల
వంగిన నడుమును వదలిన పండ్లు
పీలచేతులు, గూని, పీనుగుమోము

చిక్కగ నరిసిన చింపిరి తలయు
వ్రాలిన బొమముడి వడలిన మేను
మెడమీద గణతియు మీగాళ్ళ బూత
పలుచని గడ్డంబు పైన బుల్పిరియు
మూతిమీసపు మొల్క ముక్కురోమములు
తలవడంకును, మాట తబ్బిబ్బు, మరపు
చొల్లుగారెడు నో రశుభ్రంపు కంపు
కన్నుల బుసులును కాంక్షమిక్కుటము."

"కొండయ్య :

"కల్లల పుట్టిల్లు కడునోడలెల్ల
శిస్తు వెడలిన చింత చివికిన గంత
పత్తిగింజల సంత, పరదేశి బొంత
ఊదుపోవని డొక్క ఉరిపడ్డ నక్క
ఉచితం బెరుంగని ఊడలి తొత్తు
తెరలు ఈదిన చెల్లి దేవాంగ పిల్లి
మాయలకతకారి, మందులమారి
కాయని పడుచెట్టు కడుబాడు చెట్టు
దొంతర తినగండి తొమ్మంద్ర దొంకి
అం దతుకుల బొడ్డి ఆమిదెపు మడ్డి
అఖిల కోతలవెల్లి ఆ సుబ్బతల్లి."

మల్లయ్య :

"వృద్ధ వానరమైన వెసరాగ ముండ
దద్దరింపుచు లేచి తగునూత కోల
విరిగిన రొండియు నూచకా కాళ్ళు
ఉరిపిపోయిన యొళ్ళు నూడిన తలయు

తోలుశల్యములతో తూగాడు నడుము
పీలచేతులు నడ పీనుగు రీతి."

శ్రీనాధునిలో వున్న శబ్దసౌష్టవంగానీ సహజత్వంగానీ, భావశబలత గానీ, మిగిలిన ఇద్దరిలో లేవని చెప్పటానికి పై ఉదాహరణ చాలు అనుకొంటాను. కొండయ్య, మల్లయ్యలు శ్రీనాధుని తరువాత వారు. వారు శ్రీనాధుని అనసరించ గలిగారే కాని, కథకు ప్రతిభను గానీ, ఒక ప్రత్యేకతను గానీ, ప్రతిపాదించ లేకపోయారు. రామాయణకథ వాల్మీకి మహర్షి చేతుల్లో పడినట్లు ఈకథ శ్రీనాధునివంటి ప్రతిభాశాలి చేతుల్లో పడటం మన అదృష్టం. కొంతవరకు శ్రీనాధుని అదృష్టం కూడా.

శ్రీనాధుని మిగిలిన రచనలు ఒక ఎత్తు; యీ రచన ఒక ఎత్తు. ఎప్పటికైనా ప్రజల హృదయాలలో స్థిరనివాసం ఏర్పరచుకోటానికి శ్రీనాధునికి ఈ రచన ఉపయోగపడినట్లు మిగిలిన రచనలు ఉపయోగ పడవు అనుకోవటం అతిశయోక్తి కానేరదు.

• •

ఈ నా రచనకు మిత్రులు అనేకమంది బహు విధాల సహాయం చేశారు. అందులో ముఖ్యంగా పేర్కొనదగ్గవారు - మిత్రులు బాలాంత్రపు రజనీకాంతరావు, కుందుర్తి ఆంజనేయులుగార్లు. మొదటివారు యీ నాటకంలో నేను ఉపయోగించుకొన్న "ఎన్నాళ్ళకు?" అనే పాటనూ, రెండవవారు "ఓ విధ్వంసిని" అనే పద్యాన్ని వ్రాశారు. అందుకు వారికి నా కృతజ్ఞత.

•